వెల
రూపాయి

మొదటి ముద్రణ : 1000 ప్రతులు

నవంబరు
1956

శ్రీ కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

# విషయసూచిక


| | | | | పుట |
|---|---|---|---|---|
| 1. | 'కాంతం' పుట్టుపూర్వోత్తరాలు | | .... | 1 |
| 2. | హెడ్ మాష్టరు | .... | .... | 12 |
| 3. | చట్టి | .... | .... | 14 |
| 4. | వృథాప్రయత్నము : 'రహస్యము బయట పెట్టకూడదు' | .... | .... | 32 |
| 5. | జ్యోతిషం | .... | .... | 42 |
| 6. | చమత్కార సంభాషణ | .... | .... | 53 |




అవి ఏవీ అంటే, ప్రధానోపాధ్యాయునికి కూడా ముక్కూ, నోరూ, చెవులూ, చేతులూ, కాళ్ళూ మొదలైన అవయవాలు ఉంటాయనీ; మానవజాతికి సహజమైన ఈర్ష్యా, అసూయ, కోపమూ, రోషమూ, మదమూ, మాత్సర్యమూ మొదలయిన గుణాలు ఉంటవి అనీ చెప్పవచ్చును.

ఇవన్నీ ఎందుకూ, ఏమంత గొప్ప విషయాలు అని అనుకోవచ్చు ఎవరైనా. నాకూ తెలుసు ఇవి గొప్పవిషయాలు కావని. కాని ఒక పదార్థముయొక్క తత్త్వ స్వరూపములను నిర్ణయించేటప్పుడు తర్కరీత్యా పరామర్శ ఈవిధంగా జరగవలెను. కాబట్టి నేను ఇవన్నీ చెబుతున్నాను.

“ఇమీడియట్ ఇన్ఫరెన్సు అయిపోయిన తరువాత మీడియేట్ ఇన్ఫరెన్సు వలన ప్రధానోపాధ్యాయుడు అనే పదార్థాన్ని గురించి మనము తెలుసుకోదగినది ఏమిటీ అన్నది రెండవ విషయము.

ప్రధానోపాధ్యాయుడు మనుష్యుడు. మనుష్యులందరికి చావు ఉన్నది. కాబట్టి హెడ్మాస్టర్లకుకూడా చావు ఉన్నది.

ఆసంగతి ఎవరికి తెలియదు అని అనడము తర్కశాస్త్ర విధానాన్ని తిరస్కరించటమే అవుతుంది. అరిస్టోటిల్ అంతవాడు సిలోజిజమ్ అనే వాద విశేషాన్ని సృష్టించి సాక్రటీసు మనుష్యుడు కాబట్టి ఆయనకుకూడా మరణము ఉంది అని నిరూపించినాడు. కాబట్టి నేను ప్రధానోపాధ్యాయునికి మరణం ఉన్నదని చెప్పడంలో వైపరీత్యము ఏమీ లేదు అని అంటున్నాను. మానవులలో చాలమందికి పునర్జన్మ ఉంటుంది కాబట్టి హెడ్మాస్టరు

అయినవాడికికూడా పునర్జన్మ ఉంటుంది అనవచ్చును. హెడ్ మాస్టరు మళ్ళీ హెడ్ మాస్టరుగానే పుడతాడు అని జగదీశ భట్టాచార్యుని మతము. అయితే మనుష్యులలో ప్రధానోపాధ్యాయుడు కారణ పురుషుడు అనీ, అట్టివానికి పునర్జన్మ ఉండదనీ వంగదేశములో నైయాయిక రత్నత్రయములో ఒకడు అయిన గంగాధర భట్టాచార్యుడు అంటాడు. కాని దానితో మనకిపుడు ప్రమేయంలేదు.

ఇంతవరకు తర్క-వేదాంత శాస్త్రముల దృష్టిలో ప్రధానోపాధ్యాయుని ఉనికినిగూర్చి చర్చించినాను.

ఇక చారిత్రకంగా చూద్దాము. చూస్తే భారతకాలంనాటికి ప్రధానోపాధ్యాయులు ఉన్నట్లు కనబడదు. ఆచార్య పదం ఎక్కువగా కనిపిస్తుంది. ఆచార్యుడే ఉపాధ్యాయుడు. కృపాచార్యుడు, ద్రోణాచార్యుడు, భీష్మాచార్యుడు మొదలైనవారు ఉపాధ్యాయులే అయి వుంటారుగాని ప్రధానోపాధ్యాయులు అయి ఉండరు.

ఉపాధ్యాయులలో భేదప్రభేదాలు బౌద్ధయుగంలో వచ్చి, దానితరువాత బ్రిటిష్‌యుగంలో స్థిరపడిపోయినవి.

ప్రధానోపాధ్యాయుడు అంటే ఉపధ్యాయులందరిపై అధికారి. రాజులలో ధర్మరాజువలెనూ, పర్వతాలలో హిమాలయము వలెనూ, పుష్పాలలో సకలగుణ సంపెంగవలెనూ! మాస్టర్లలో హెడ్ మాస్టరు రాణిస్తూ ఉంటాడు.

ఆయన కనుసన్నలలో మెలగుతూ ఆయన ఆజ్ఞలను పాలిస్తూ ఉండేవారు సహాయోపాధ్యాయులు అవుతారు.

సహోపాధ్యాయులు హెడ్ మాస్టరు ఎడల వినయ విధేయతలు ప్రదర్శిస్తూ, ఎల్లప్పుడూ కూడా ప్రణత శిరస్కులై ఉంటూ ఉంటారు.

పాఠశాల ఆవరణలో వారి కీర్తి వ్యాపించి ఉంటుంది. ఆకీర్తి శరత్కాలపు వెన్నెలవలె ధవళమై నిర్మలమై ఉంటుంది.

పాఠశాల నిర్వహణ భారమంతా వారి భుజస్కంధములపై ఉంటుంది. సిమెంటు కుడ్య పరీవృతమైన ఆ పాఠశాల ఆవరణే ఆయన సామ్రాజ్యము. ఆ సామ్రాజ్యములో శ్రీవారి మాట అనుల్లంఘనీయమైన శాసనము. వారు అప్పుడు దుశ్శాసనులు. (దుష్కరమైన శాసనములు కలవారు దుశ్శాసనులు అని అర్థము.) ఆ పాఠశాలలో ఆ ప్రధానోపాధ్యాయ సర్వేశ్వరుడు శిఖరములయందు కూడుకొన్న చంద్రమండలము కల మేరుపర్వతమువలె భాసిస్తూ ఉంటాడు.

శ్రీవారు ఎల్లప్పుడూ ధౌతవస్త్రములనే ధరిస్తూ ఉంటారు. కాబట్టి మేరుపర్వత సాదృశ్యము చెప్పవలసి వచ్చింది. వారి శిరోవేష్టమును చంద్రమండలముతో పోల్చడము కూడా ఉచితంగానే ఉన్నది.

చక్రవర్తులకు వందిమాగధులు ఉన్నట్లుగానే ప్రధానోపాధ్యాయులవారికి వందిగణము ఉంటుంది.

శ్రీవారు కృపాసముద్రులనీ, పాఠశాల పరిపాలనా నిర్వహణ కార్యమునందు అతి సమర్థులనీ, సాధువర్తనులనీ, ధర్మానురక్తులనీ స్తోత్రపాఠాలు వల్లిస్తూ ఉంటారు ఈ వంది జనులు. సహోపాధ్యాయులే కొందరు వంది జనము అవుతారు.

ప్రధానోపాధ్యాయులు పాఠశాలలో పర్యవేక్షకులై పైరి వీర భయంకరులై ఉంటూ ఉన్నా, ఇతర ప్రదేశములయందు గంగ గోవువలె సాధువులును, గొర్రెలవలె అమాయకులును అయి ఉంటారని ప్రతీతి. (A lamb at home and a lion at School)

డాక్టరు ఆర్నాల్డు అనే ఆయన ఇంగ్లండు దేశంలో ప్రసిద్ధుడైన హెడ్‌మాస్టరు.

ఇంగ్లండు దేశపు ప్రభువైన నాలుగవ జార్జి ఒకసారి ఆర్నాల్డు పాలిస్తూ ఉన్న పాఠశాలను చూడటానికి వచ్చినాడు. ఆర్నాల్డు, ప్రభువుకు పాఠశాలయొక్క వివిధ భాగాలు చూపునపుడు తానుముందు నడిచి, ప్రభువు తన పిరుంద వచ్చేలాగున చేసినాడట! అంతేకాక తన శిరస్సుపైనున్న టోపీని (Hat) తీయలేదట! ఇల్లాగ చేయడము ప్రభువును అగౌరవపరచుటే అవుతుంది. అయినా అట్లాగే చేశాడు.

ఆ తరువాత ప్రభువువారిని తనగదిలోకి తీసికెళ్ళి, వినయంగా నమస్కరించి "నేను నాహాటు తీయకుండా మీముందు నడవడం కూడదనిసని అని నాకు తెలియకపోలేదు. కాని నా బాలురు నన్ను సర్వాధికారివలె చూస్తున్నారు. నాకంటే పైఅధికారి ఒకరు ఉన్నారని వాళ్ళకు తెలిస్తే నాకు అపకర్ష వస్తుంది. అందుకని ఆ విధంగా ప్రవర్తించాను. క్షమించు ప్రభు" అని వేడుకొన్నాడట!

హెడ్‌మాస్టరు అయినవాడి చిత్తవృత్తి అల్లాగ ఉంటుంది.

అల్లాంటి హెడ్‌మాస్టర్లు పూర్వం వుండేవారు. వారియెడల విద్యార్థులూ, ఇతర జనమూ కూడా భక్తిప్రపత్తులతోనూ వినయ విధేయతలతోనూ మెలగుతూ వుండేవారు.

హెడ్మాస్టరు వస్తున్నాడు అంటే ప్రతాపరుద్రుడు వస్తూ వుంటే శత్రుమూకలు భయభ్రాంతులై ఏవిధంగా చెల్లాచెదరై పోయేవారో అల్లాగే విద్యార్థులు భయపడి నలుదిక్కులకూ పారి పోయేవారట!

పాఠశాలను పరీక్షించడానికి వచ్చిన ఒకానొక అధికారి ఒక కుర్రవాడిని అడిగినాడట, మాస్టరుకూ, హెడ్మాస్టరుకూ భేదం ఏమిటీ అని.

ఆ బాలుడు ఒకనిమిషం ఆలోచించి, గంట కొట్టడముతోనే క్లాసులోకి పోయేవాడు మాస్టరు. బెత్తంపట్టుకొని వరాండాలో తిరిగేవాడు హెడ్మాస్టరు అని జవాబు చెప్పినాడు.

తలకాయ ఉన్నవాడు హెడ్మాస్టరు అనీ, తలకాయలేనివాళ్లు వట్టిమాస్టర్లనీ ఒకనిర్వచనం కూడా ఉన్నది.

ఈ హెడ్మాస్టర్లు అనబడేవారు స్కూలు వరాండాలో తిరుగుతూ ఉంటే కులశైలము యొక్క సమున్నతత్వమూ, సముద్రా లంత గాంభీర్యము, వారిలో గోచరిస్తవి. బాల బాలికలు అందరూ భీతచేతస్కులయి, ఉచితస్థానములలో నిశ్చేష్టులయి కాష్ఠాకృతిని పొందుతారు. వారి చేతిలోని బెత్తమును చూచి, వారి కంటి ఎఱుపుజూచి కంపమును పొందని బాలుడు ఉండడు.

ప్రధానోపాధ్యాయులకు సింహతలాటపు కంకణములూ, భుజకీర్తులూ ఉంటే బాగుంటుందని ఈమధ్య ఎవరో ఒక ఉపాధ్యాయుల సమావేశంలో ప్రతిపాదించారు.

అదే సమయంలో విద్యార్థి సమావేశంలో ఒకరు ప్రధానోపాధ్యాయుడు, కాళ్ళకు ఎక్కువగా ధ్వనించేటువంటి కంచుగజ్జెలను ధరించాలనీ, వారిచే ఆపని చేయించుట విద్యార్థుల ప్రథమ కర్తవ్యమనీ, ఈపని జరుపుటకు విద్యార్థులు ఎంత త్యాగమైనా చేయుటకు సిద్ధంగా ఉన్నారని గంభీరమైన ఉపన్యాసం ఇచ్చినాడు.

కవులు కాళ్ళకు గండపెండేరము ధరించిన విధంగానే ప్రాధానోపాధ్యాయులు ఈ కంచుగజ్జెలను ధరించవలయునని వారివాదన.

హెడ్‌మాస్టరును గురించి ఇంకా ఒక్కవిషయం ఉన్నది చెప్పవలసింది.

ఒక్కొక్కరిని జూచి కొందరు 'ఈ ముఖానికేనా హెడ్ మాస్టరు గిరీ' అంటూ ఉంటారు. 'నీముఖానికి తోడు హెడ్ మాస్టరు గిరీ కూడానా' అనీ, 'ఇది హెడ్‌మాస్టరు చేసే ముఖం కాదనీ' ఒక్కొక్కరు ఒక్కొక్కరి విషయంలో అంటూ ఉంటారు.

నన్నే అన్నారు నా మిత్రులు, "నీది హెడ్‌మాస్టరు ముఖం కాదు" అని.

దీనినిబట్టి ముఖాలలో హెడ్‌మాస్టరు ముఖం అంటూ ఒక రకం ముఖం ఉంటుంది అని స్పష్టంగా తెలుస్తున్నది.

సాముద్రిక శాస్త్రం చూచినా ఈ రకంముఖాల లక్షణాలు ఎల్లాంటివి అయిఉంటవో నాకు తెలియలేదు.

వాడి ముఖంలో రాజకళ ఉన్నదనీ అనడము మనము తరుచుగా వింటూ ఉంటాము. అల్లాగే హెడ్‌మాస్టరు కళ అని ఒక రకం కళ ఉండి తీరాలి.

హెడ్‌మాస్టరు మాటలలో కూడా ఏదో విశిష్టత ఉండి ఉంటుంది. ఎందుకూ అంటే ఇద్దరువిద్యార్థులు పోట్లాడు కుంటూ ఉన్న సమయంలో అందులో ఒకడు "ఏమిటోయ్, ఏదో హెడ్‌మాస్టరులాగ మాట్లాడు తావేం!" అనడము విన్నాను. దీనిని బట్టి గ్రహించాను. హెడ్‌మాస్టరు మాటలలో కూడా ఏదో గుర్తింప తగిన ప్రత్యేకత ఉన్నదీ అని.

హెడ్‌మాస్టరు పదవి ఎంతో వాంఛనీయ మైనదిగా ప్రజలు అనుకొంటారు. ఆ పేరు నందు కూడా జనులకు ఎంతో అను రక్తి ఉన్నది.

తల్లి తన కుమారుని భవిష్యత్తును గూర్చి కనే కలలలో, వాడు హెడ్‌మాస్టరు అవుతాడు అన్నది ఒకటి. "మా తండ్రి పెద్ద అయిన తరువాత హెడ్‌మాస్టరు కాడత్రా" అని అందరి లోనూ చెప్పుకొని సంతోషిస్తుంది తల్లి.

తల్లి పిల్లవాణ్ణి ముద్దుపెట్టుకోవడముకూడా అంతే. పసివాణ్ణి ఎగరేసి ముద్దెట్టుకుంటూ "నా తండ్రే! మా నాయనే! మా హెడ్ మాస్టరే!" అంటుంది.

ఒక కుఱ్ఱవాడికి పిల్లను ఇద్దామని వచ్చిన వాళ్లు, ఆ చిన్న వాడి బంధువులను అడిగారు. "ఏమండీ, ఆ అబ్బాయి ఎట్లా ఉంటాడూ" అని. వాళ్ల "ఆ అబ్బాయి కేమండి. నిక్షేపంలా గుంటాడు. వెనకాల నుంచి చూస్తే అచ్చంగా హెడ్‌మాస్టరులా గుంటాడు" అని చెపుతారు.

ఆ మాటయందు ప్రజలకు అంత ప్రీతిఉన్నదీ అని చెప్పడా నికి పై విషయాలు చెప్పినాను.

ప్రతి పాకశాలలోనూ ఉండే హెడ్‌మాస్టరును గురించి ఇంత వరకు చెప్పినాను. ఇక చిన్న హెడ్‌మాస్టరును గురించి ఒక ముక్క వ్రాసి ఈ వ్యాసం ముగిస్తాను.

చిన్న హెడ్‌మాస్టరు అను వ్యక్తి హెడ్‌మాస్టరును అనుస రించి ఉంటాడు. ఈ వ్యక్తి ఒక ఛాయాగ్రహము వంటివాడు. ప్రత్యేకవ్యక్తిత్వము ఏమీ లేక హెడ్‌మాస్టరును ఛాయవలె అనుసరిస్తూ ఉంటాడు.

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరు గుతుంది. ఈ చిన్న హెడ్‌మాస్టరుకూడా తనచుట్టూ తాను తిరు గుతూ పెద్ద హెడ్‌మాస్టరు చుట్టూ తిరుగుతూ ఉంటాడు.

నాయకుడికి, విదూషకుడు ఎంత అవసరమో, నాయికకు మాలి ఎంత అవసరమో, హెడ్‌మాస్టరుకు చిన్న హెడ్‌మాస్టరు అంత అవసరము.

---

# చుట్ట

చుట్ట త్రాగటము సనాతనమైన ఆచారమేనా, లేక ఈయుగము వారు అలవరచుకొనిన ఒక దురభ్యాసమా అని ప్రశ్న వచ్చింది.

పోర్చుగీసునావికుడు వాస్కోడిగామా మనదేశానికి పొగాకు తీసుకొని వచ్చినాడని, అంతకుముందు మనదేశవాసులకు పొగాకు సంగతి తెలియదని, ఒక వదంతిమాత్రము ఉన్నది.

కాని ఈ విషయం అంగీకరించడానికి ఏమాత్రమూ వీలు పడదు. మన ప్రాచీన గ్రంథాలలో ఈ చుట్ట ప్రశంస వచ్చినది. కాబట్టి, చుట్టతాగటము చాలా ప్రాచీనమైన ఆచారముగా మనము అంగీకరించవలసి ఉంటుంది.

భీముడు చుట్టతాగేవాడని ఢంకామీద దెబ్బకొట్టి చెప్ప వచ్చును. భారతములోనే కావలసినంత సాక్ష్యము దొరుకుతుంది.

విరాటపర్వంలో అన్నాడూ ''మొలమోపి పెక్కు చుట్టల్ పలుత్రాటం జుట్టి గోపభావం బమరన్'' అని.

భీముడు క్షణక్షణానికి చుట్టుకోలేక చాలా పెద్దవైనవిన్నీ, బరువైనవిన్నీ అయిన చుట్టలు ఎక్కువగా ఒకేసారి చుట్టుకొని వాటిని చాలా త్రాళ్ళతో బిగించి, ఒకచోట పడేసి ఉంచుకొనే వాడు, కావలసినప్పుడల్లా ఒకటో రెండో తీసి కాల్చుకొనేందుకు.

''కోపభావం బమరన్'' అని ఎందుకు అనవలసివచ్చిందీ అంటే.

....వెధవ చుట్టలు చుట్టీ చుట్టీ ప్రాణం విసిగిపోయి, చివరకు తనమీద తనకే కోపం వచ్చింది అని చెప్పవచ్చు.

లేకపోతే ఇంకొక విధంగా చెప్పవచ్చు. పాండవులు అజ్ఞాతవాసంలో ఉన్నారు. వారంతా విరటుని కొలువులో ఉన్నారు. అప్పుడు తీరిక సమయంలో ఎప్పుడో భీముడు ఈ చుట్టలు చుట్టుకొని, "మహారాజునై యుండికూడా ఎంతగతి పట్టింది నాకు; చుట్టలు చుట్టి ఇచ్చేందుకు ఒక్క సేవకుడైనా లేకపోయెనుగదా!" అని వాపోయినాడు అని చెప్పినా చెప్పవచ్చు.

సాహిత్యంలోనే ఇంకో నిదర్శనం చూపిస్తాను; చుట్టసంగతి. మనవాళ్ళకు తెలుసును అంటానికి.

"ఎంచక నా గమనమునకు ఇంచుక చుట్టయిన కానిమ్మ" అని కళాపూర్ణోదయంలో ఉన్నది. కళాపూర్ణోదయుడే ఈమాట అని ఉంటాడు. ఏమనీ అంటే, ఈ ప్రయాణంలో నాకు ఒక చుట్ట అయినాసరే ఇయ్యవలసిందీ, అని।

"చుట్ట అయినకాని, ఇమ్మ" అంటే ఒక చుట్టముక్క అయినా ఇయ్యవయ్యా అన్నమాట.

అంటే ఆ కళాపూర్ణోదయుడు చుట్టే ఎడంకూడా త్రాగేవాడని వ్యాకరణికార్థం. అది ఏదో మనము ఇప్పుడు ఊహించలేము.

ధర్మరాజు ఒకసారి ఏదో ప్రసంగంలో చుట్ట అంటే ఎవరికీ కోపం రాకూడదు అని చెబుతూ, "చుట్టయును పగయును భేదం బెట్టి జనులకు తగదు" అన్నాడు. చుట్ట తాగేవాడు కాకపోతే దానిని అంతగా వెనకేసుకురాడు.

కాటూరు వెంకటేశ్వరరావుగారు పడుకొనబోయేముందు రెండు మూడు చుట్టలు చుట్టుకొని, పక్కనున్న బల్లపై పెట్టుకొని, నిద్రపోయేవారు. "పడుకోబోతూ ఉంటిరి. ఇప్పుడు

త్రాగవకూడదా: ఎందుకంటే చుట్టలు చుట్టుకొన్నారా? "అని అడిగాను.

"రేపు ప్రొద్దున నిద్ర లేవడములోనే కావాలన్నారు. అప్పుడు చుట్టుకోడం అంటే ఇబ్బందికంగా ఉంటుంది. అందుకని ఇప్పుడే చుట్టలు చుట్టుకొని పడుకుంటాను.

"భాగవతాన్ని చూసే ఆదిశేషు కూడా ఇట్లాగే చేసేవాడట. 'చుట్ట చుట్టుకొని పడుంది' అని భాగవతంలో ఉన్నది" అన్నారు.

విష్ణుమూర్తికే 'చుట్టపానుపు' అని పేరు ఎందుకు ఉన్నది, అని అడిగితే ఏమి సమాధానం చెపుతారు? ఏదో పోనీలే అని ఊరుకుంటూ ఉన్నా కాబట్టి సరిపోయింది కాని! అసలు చుట్టతో ఆయనకు ఏమి సంబంధం? ఎందుకు గ్రంథం లోకి దిగడము! ఆయన చుట్ట త్రాగేవాడని తెగేసి చెప్పి ఊరుకుంటాను.

అయితే శ్రీ విష్ణు పాదారవింద సేవకులూ శ్రీ ఏడుకొండల వేంకటరమణుని భక్తులూ మొదలైనవారిచే తాగబడే చుట్టలకు తిరు చుట్టలు అని పేరు. మనము తాగేవి మామూలు చుట్టలు. అంతే భేదం.

కాబట్టి భారతకాలం నాటికే చుట్ట త్రాగే అలవాటు మనకు ఉన్నట్టు తెలిపోయింది.

మరొక్క విషయము కూడా తెలుస్తున్నది. గురుజనుల సమక్షంలోనూ, స్త్రీల ఎదుటా చుట్ట తాగేవారు కారని భారతంలో ఉన్నది.

ఎక్కడ ఉన్నదీ అనవచ్చు. త్రాగవచ్చునని ఎక్కడ ఉన్నది? త్రాగవచ్చునని లేదు కాబట్టి, త్రాగకూడదు అనే ఉన్నట్లు మనము విధిగా భావించవలె. ప్రతి పక్షులకు అనుకూల దృష్టాంతము లేనపుడూ, మనము చెప్పినదానికి దృష్టాంత విరోధము లేనపుడూ స్వపక్షస్థాపన జరిగినట్లే భావించుట తర్క సమ్మతము. ఇతి తర్కః.

స్త్రీల సమక్షంలో చుట్ట తాగడము నిషేధమే అయినప్పటికీ. ప్రియురాలితో ఏకాంతంగా ఉన్న సమయంలో చుట్ట తాగడము అనుపూర్విక సంప్రదాయముగా కనిపిస్తుంది.

భార్య ప్రియునిదగరకుచేరి తమలపాకుల 'చుట్టలు' ఇచ్చి నట్లు అనేకచోట్ల వర్ణితము. పాండురంగ మహాత్మ్యంలో ఈ విషయము స్పష్టంగా చెప్పినాడు. "తనదు తొయ్యలి, వీడ్యము చుట్టియీన్'' అని ఉన్నది. భార్య తమలపాకులూ. చుట్టా కూడా. ఇచ్చినట్లు చెప్పబడి ఉన్నది.

బంధువులు, స్నేహితులు వచ్చినపుడు భోజనానంతరం అందరికీ తలొకచుట్ట ఇయ్యడము ఇప్పటికీ మనలో ఆచారంగా ఉన్నది.

ఈ ఆచారము భారత కాలంనాటికే ఉన్నదని ఊహించడానికి ఆధారాలు దొరుకుతున్నవి.

శ్రీకృష్ణ భగవానులవారి ఇంటికి బంధుజనులంతా వచ్చి నారు. ఆ వచ్చినవారిలో పాండురాజు తనయులూ, ధృతరాష్ట్రుని కుమారులూ కూడా ఉన్నారు.

శ్రీకృష్ణుడు మొదటినుంచీ పాండవులయందు స్నేహభావంతో ఉంటూ, ఆదరణచూపిస్తూ, పక్షపాతం ప్రకటిస్తూ ఉండినాడు.

ఒక సందర్భములో చుట్టలు ఈయడములో కూడా ఈ పక్ష పాతమే ప్రదర్శించి, పాండుతనయులకు దలొక చుట్ట ఇచ్చి, ధార్తరాష్ట్రులకు ఇయ్యలేదు.

అల్లాగ పక్షపాతంలో ప్రవర్తించటానికి, కారణము ఊహించ డమూ కష్టముకాదు. పోగాకు ఆ రోజులలో చాలా ప్రియంగా ఉండీ సర్వజన లభ్యంగా ఉండేదికాదు. మహారాజులు మాత్రమే చుట్ట తాగేవారు.

పాండవులు అయిదుగురు. ఆ అయిదుగురికి అయిదు చుట్టలు ఇయ్యడము అంత కష్టమైన పనికాదు.

ధార్తరాష్ట్రులు నూర్గురు. అంత మందికీ చుట్టలు ఇయ్య డము కష్టం.

ఈ కారణముచేతనో, లేక పాండవ పక్షపాతి కావడము చేతనో శ్రీకృష్ణభగవానులు పాండవులకు మాత్రము చుట్టలు ఇచ్చి, ధార్తరాష్ట్రులకు ఇయ్యలేదు.

అప్పుడు భీష్మాచార్యుడో కృపాచార్యుడో అంటాడూ; "పాండవులకు ధార్తరాష్ట్రులు పుండరీక నేత్ర చుట్టరికంబున నీకు నొక్కరూప" అంటాడు.

"హే మహానుభావా, కృష్ణా, పాండవులు, ధార్తరాష్ట్రులు అనే భేదం ఉండకూడదు. చుట్టరికంబున అనగా చుట్టలు పంచి యిచ్చే విషయంలో అందరూ నీకు ఒక్కరూప, అందరూ సమానులే సుమా" అంటున్నారు ఆ ఆచార్యులవారు. చుట్టకు సంబంధించిన స్నేహమే చుట్టరిక మని ముందు నిరూపిస్తాను.

ఆచార్యులవారితో సంబంధం ఉన్నది కాబట్టి అవి తిరు చుట్టలే అయి ఉంటవి.

చుట్టతాగడము ప్రధానంగా రాజులకథలలోనే కనపడుతుంది గాని సామాన్యుల విషయంలో అంత వ్యాప్తిలో ఉన్నట్లు కనపడదు.

ధర్మరాజు నిర్మించిన మయసభ సంగతి చెప్పే సందర్భంలో సభాపర్వంలో, 'సామంతరాజులు చుట్టుకొనిరి'—అని ఉన్నది.

ఏమి చుట్టి ఉంటారు: చుట్టలే చుట్టుకొని ఉంటారు. ప్రాకరణికార్థము.

ఇల్లాగ భారతంలో ఎక్కడ చూచినా చుట్టలసంగతి బహుళంగా ఉన్నది.

ఇంకొక సంగతి జ్ఞాపకం వచ్చింది. విష్ణుమూర్తికి చుట్ట లంటే మహా ఎక్కువైన ప్రీతి అని చెపటానికి రెండుమూడు నిదర్శనాలు కనబడుతున్నవి. విష్ణువుకు శంఖచక్రాలు ఉన్నవి అన్నది అందరికీ తెలిసినవిషయమే.

శ్రీరంగనాధుడికి చుట్టయందు ఉండుకున్నటువంటి ప్రేమ వల్లనే తనశంఖమునకు 'చుట్టుగుల్ల' అని పేరు పెట్టుకొన్నాడు— చుట్టుగుల్ల అన్నా చుట్టగుల్ల అన్నా ఒకటే అర్థము. అల్లాగే తన చక్రాయుధానికి చుట్టుగైదుప అనికూడా ముద్దుపేరు.

అసలు ఆయనకే చుట్టువాలుదారి, చుట్టువాలుడోదు అనేపేర్లు ఉన్నవి. చుట్టకే రూపాంతరము చుట్టు. చుట్టబడినది కాబట్టి చుట్టు—పెట్టు, తిట్టు, కుట్టు, నెట్టు, మొట్టు శబ్దంబులవలె ఏర్పడినది.

పూర్వకాలంలో రాజులకోసం చుట్టలు తయారుచేయడానికి ప్రత్యేకంగా ఒక ఇల్లు ఉంటూ ఉండేది. దానిదే చుట్టిల్లు అనే

వారు. చుట్టలు చుట్టడానికే ఏర్పడ్డ ఇల్లు 'చుట్టిల్లు' అయింది. ఇది సట్టిల్లు వంటి శబ్దము. నడు + ఇల్లు నట్టిల్లు అయినట్లే చుట్టు ఇల్లు చుట్టిల్లు అయింది.

చుట్టలు తాగేవారు ఇద్దరు కలియడముతోనే వారిద్దరికి ఇట్టే స్నేహము కుదిరిపోతుంది. ఆ ఇద్దరిలో ఒకడు చుట్ట చుట్టుకొని, నోరువిప్పి ఏ మాటా అనకుండానే రెండవ వానివైపు చెయ్యి చాపడముతోనే, ఆ రెండవ మనిషి నిప్పుపెట్టె తీసి అతని చేతిలో పెడతాడు.

సాధారణంగా మొదటి పెద్దమనిషి రెండు చుట్టలు చుట్టి పక్కనున్న పెద్దమనిషికి ఒకటి ఇయ్యడమే ప్రాకటము.

ఇల్లాగ చుట్ట సంబంధంగా ఇద్దరు మనుష్యుల మధ్య ఏర్పడిన సంబంధమే చుట్టరికము అయినది. ఇదే చుట్టరిక శబ్దము యొక్క వ్యుత్పత్త్యర్థము.

ఈ వ్యాపారం ప్రాచుర్యంగా బంధువుల మధ్యనే జరుగుతూ వచ్చిన కారణాన చుట్టరికము అంటే బంధుత్వము అనే అర్థము స్థిరపడిపోయి రూఢము అయింది. దీనినే సముదాయార్థము అని కూడా అంటారు.

ఇప్పటికీ చుట్టము అంటే బంధువు అనే అర్థమే కాకుండా స్నేహితుడు అనే అర్థము కూడా ఉన్నది.

చుట్ట, పొగ అనే మాటలకు తర్కశాస్త్రంతో ఉన్న సంబంధము చూస్తే, చుట్టయొక్క ప్రాశస్త్యమే కాక, తర్కశాస్త్రమును రచించిన గౌతముడూ, వాత్స్యాయనుడూ దిఙ్నాగాచార్యులవారూ గంగేశోపాధ్యాయులూ మొదలైనవారు చుట్టా, పొగా, ఈ రెండి

టికిని గల సంబంధమును బాగా గుర్తించినవారు అని స్పష్టంగా బోధపడుతుంది.

తర్కంలో అనుమాన ప్రమాణవాదము అనబడే ఒకవాదము ఉన్నది. ఆ వాదన ఇల్లాగ ఉంటుంది. "ఎక్కడ ధూమము ఉన్నదో అక్కడ అగ్ని ఉన్నది. ఇక్కడ ధూమము ఉన్నది. కాబట్టి ఇక్కడ అగ్ని ఉన్నది" ఈ వాదననే ఇంగ్లీషులో సిలోజిజమ్ అంటారు.

ఈరకమువాదనకు ప్రమాణంనాచేవ్రాయబడిన విచిత్రతర్కం చూడనగును. "ఎక్కడెక్కడ ధూమము ఉన్నదో అక్కడక్కడల్లా అగ్ని ఉన్నది" అన్నది హేతువాక్యము.

ఆ హేతువాక్యమే దోషయుక్తము అయితే వాదము దోషభూయిష్ఠము అవుతుంది. హేతునిర్ణయము చేయడంలోనే తార్కికుని ప్రతిభ ప్రదర్శితము అవుతుంది.

అందుచేత తార్కికుడు హేతుపుష్టికోసమూ వైయాకరణి ధాతుపుష్టికొరకు చూస్తూ ఉంటారు.

ఆసంగతి అల్లాగ ఉంచి ప్రకృతానికి వద్దాము.

ఇప్పుడు పైన చెప్పిన వాదనలో హేతుపుష్టి ఉన్నది. ఎందుచేతనూ అంటే పొగ ఉన్నచోటల్లా అగ్ని ఉంటుందీ అన్న విషయాన్ని కాదని ఎవరూ అనలేరు.

కొంచెము తార్కిక పరిభాషలోకివెడితే, ధూమానికి, అగ్నికీ, నియత సంబంధము ఉన్నది అని అంటారు. ఆ రెండూ ఎప్పుడూ కలిసిఉంటవి. పొగ ఉన్నదీ అంటే, అగ్ని ఉన్నదన్నమాటే. అందుకనే 'యత్ర యత్ర ధూమః తత్ర తత్ర అగ్నిః' అని చెప్పాడు శాస్త్రకారుడు.

పై హేతువాక్యాన్ని తార్కికుడు ఎట్లా నిర్మించగలిగినాడు? అని ప్రశ్న. "చుట్ట త్రాగడాన్ని చూచి!" అని జవాబు వచ్చినట్లు చెప్పి తీరాలె! ఇంకోమార్గం లేదు.

ఎందుకంటే ఆ నియత సంబంధం ఒక్క ఈ విషయం లోనే అనుమానానికి అవకాశంలేని పద్ధతిలో కనిపిస్తుంది. చుట్టలో అగ్ని ఉండే నోట్లోనుంచి ధూమము వస్తుంది. అగ్ని లేకపోతే ధూమం రాదు. యత్ర యత్ర వహ్నిర్నాస్తి తత్ర తత్ర ధూమోఽపినాస్తి.

అయితే "చుట్ట కాల్చు చుండగా ధూమము వచ్చుటయూ అప్పుడు అగ్నియూ ధూమమును కలిసియుండుటయూ, మేము చూచితిమి" అని ఈ తార్కికులు ఒప్పుకోరు. ఒప్పుకోక 'యత్ర ధూమస్తత్రాగ్నిః, యథా మహానసః' అంటారు. ధూమమూ అగ్ని వంటయింటియందు నియత సంబంధముతో ఉన్నవి అని అన్వయ దృష్టాంతము ఇస్తారు.

ఇల్లాగ అనడము చుట్టయందు కేవల వ్యతిరేక భావము ఉండడమువల్లనేగాని మరొకటి కాదు. చుట్టకు ఈ విధంగా అన్యాయం జరిగింది తార్కికుల చేతులలో.

ఈకారణముచేతనే ఈనాటికీ తర్కించదలచుకొన్నవారికిచేతిలో చుట్ట ఉన్నేకాలదు. అందుకనే వారు చుట్టతాగరు. ఈవిషయం నిజమో అబద్ధమో తెలుసుకో వలెనంటే జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారిని, తిరువేంగడాచార్యులుగారిని అడుగవచ్చు

నిజానికి ధూమానికి, అగ్నికి ఏకాంతికసంబంధం మహానస ములో చస్తే కుదరదు. అక్కడి సంగతి మా కాంతాన్ని అడి

గాను, "ఏమిటి నిజం సంగతి చెప్పు, ధూమము ఉన్న చోట్ల నెల్లా అగ్ని ఉంటుంది అంటాడు న్యాయదర్శన గ్రంథకర్త అది నిజమేనా!" అని.

తర్కశాస్త్రం రచించిన గౌతముడే కాని ఆ గ్రంథాన్ని తెలిగించిన వెంకటరమణశాస్త్రిగారే గానీ ఎవరైనా సరే, ఈ ధూమాగ్నుల మధ్య ఉన్న బంబంధం విషయంలో కాంతం చెప్పిన దానికి కట్టికెక్కిన తల వంచవలిసిందే గాని కాదనటానికి వీలులేదు. ఈ విషయంలో ఆమె నిర్ణయము ప్రమాణవాక్యము. దానికి విప్రతిపత్తి లేదు కాబట్టి ఆమెవాక్యం సర్వతంత్ర సిద్ధాంతముగా, అనగా ఇతరశాస్త్రములకు వైరుధ్యంబు లేనిదానినిగా అంగీకరింపక తప్పదు.

"అనేకసార్లు ఊరికే పొగరాజుతుందే గాని నిప్పు రాజదు. ఎప్పుడైతే నిప్పురాజి అగ్ని ఏర్పడుతుందో అప్పుడు పొగడం డదు" అని ఆమెగారు తెగేసి చెప్పింది.

మహానసములో ధూమాగ్నులమధ్య నియతసంబంధంలేదు. ఒక్క చుట్ట కాలుస్తున్నపుడే ఎఱ్ఱని నిప్పూ, పొగా కలిసి ఉంటవి.

కాబట్టి యత్రయత్ర ధూమః తత్రతత్ర అగ్నిః అన్న వాక్యం చుట్ట దహనసంస్కారాన్ని చూచే అనబడ్డది.

గౌతముని కాలంనాటికి చుట్ట కాల్చడము మిక్కిలి వ్యాప్తిలో ఉండవచ్చును.

అభ్యుదయ రచయితలు అన్నట్లు ఆకాలంలో రాజులను సంతోషపెట్టడానికే సకలశాస్త్రములూ, కావ్యాలు పుట్టినవి కాబట్టి,

రాజులు చుట్టకాల్చడానికి సంబంధించిన ఈ వాక్యం తర్కశాస్త్రంలోకి ఎక్కింది.

కాబట్టి ఇంతకూ తేలిన విషయము ఏమిటంటే, చుట్ట పంపినీమీదే తర్కశాస్త్రం పుట్టిందీ అని !

ఉదాహరణలలో మహానసము లేదా అని చెప్తారు తార్కికులు. అల్లా అనకుండా యత్ర యత్ర ధూమస్తత్రాగ్నిః యథా, చుట్ట మహానసంస్కార వైభవేః అని ఉండాలిసింది.

సాధర్మ్యనిరూపణ ఇల్లాగ చుట్టకు సంబంధంగా ఉండకపోవడానికి కారణముకూడా మనము ఊహించవచ్చు. మొదట్లో రాజులకు సంబంధించిన ఆచారాన్ని తర్కశాస్త్రంలోకి ఎక్కించారు. కాని తరువాత రాజుల ప్రతిభ తగ్గింది. బ్రాహ్మణుల ప్రాబల్యం వచ్చింది. చుట్ట త్రాగడము రాజులలో ఉండేదని చెప్పాను. వారు క్షత్రియులు. అనగా బ్రాహ్మణేతరులు. బ్రాహ్మణేతరుల ఆచారాన్ని పేర్కొని, దానికి తర్కశాస్త్రంలో ప్రాధాన్యము ఇయ్యడము, తర్కశాస్త్ర గ్రంథకర్తలైన బ్రాహ్మణులకు ఇష్టం లేకపోయివుంటుంది. అందుకనే తమకు ఇష్టమైన మహానస విషయము ఉదాహరణగా చేర్చినారు.

బ్రాహ్మణులవలన బ్రాహ్మణేతరులకు జరిగిన అన్యాయాలలో ఇది యొకటి.

ఇక అలంకారశాస్త్రంలో చుట్టను గూర్చిన ప్రమేయము ఉన్నది. అదిప్పుడు తేటే విషయం కాదు. సంస్కృత వాఙ్మయంలో చుట్ట ప్రశంస కొద్దిగా ఉన్నదని చూపిస్తాను. కాళిదాసు మేఘ సందేశంలో మేఘములు చుట్టలతో పోల్చబడినవి.

మేఘములు చుట్టలు చుట్టుకొని గగనమార్గాన సంచరిస్తున్న
వట :

ధూమజ్యోతి స్సలిలమరుతాం అన్నచోట ధూమప్రశంస వచ్చింది. కాబట్టి కాళిదాసుకు చుట్ట తాగడమూ, దానివలన పొగను పుట్టించడము అనే విషయాలు తెలిసే ఉండాలె.

చుట్ట తాగటములో రెండు విశిష్టమైన పద్ధతులున్నవి. పక్కని ఒక పేటికలో కొన్ని చుట్టలను పేర్చి దానిని, ఒక నిప్పు పెట్టెనూ, పక్కనున్న గుండ్రని బల్లపైపెట్టి, ఒక పడక కుర్చీలో శయనించి ఠీవిగా చుట్టను ముట్టించి, ఆప్యాయంగా ధూమపానం చేయడము ఒక పద్ధతి. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఈ పద్ధతిలో చుట్ట కాలుస్తారు.

అరుగుపైనగాని లేక మరొక చోటగాని చాపపై సద్దిగిలేసి కూర్చుని చుట్ట తాగడము మరొక పద్ధతి. కాటూరివారు ఈ పద్ధతిలో చుట్ట తాగుతారు.

ఈ రెండవ పద్ధతిలోకూడా ఠీవి, రాజసము హుందాతనము సరళత, స్నేహభావమూ, రాజమార్గము మొదలైన సుగుణాలు ప్రదర్శితము కావడానికి అవకాశాలు ఉన్నవి.

చక్రవాకములు సూర్యునియందు, చకోరికలు చంద్రుని యందు, తుమ్మెదలు పుష్పాల గుత్తియందు ఎట్లాంటి అనురక్తి కలిగి ఉన్నవో అలాగే కవులుకూడా కాటూరివారి చుట్ట తాగే పద్ధతియందు అనురక్తి కలిగి యున్నారు.

చుట్టా, బీడీ, సిగరెట్టు అనేవి ఉపాధి భేదంచేత వేరు వేరు వస్తువులుగా కనపడుతూ ఉన్నప్పటికీ, వానిలో ఉపహితమై యున్న మూలపదార్థము ఒక్కటే.

ఒకటే పరమాత్మ పదార్థము త్రిమూర్త్యాకారమును పొంది నట్లే, ఇదీనూ

ఈ మహాపదార్థమును ఎఱిగిన కారణాన పండితులూ కవులూ అయినవారు ఈ త్రిమూర్తులనూ సేవిస్తూ ఉంటారు

ఎట్లాగయినా ఈ త్రికములో పర్వతాలలో మేరువువలె శిఖరాలలో, కైలాసములాగ, సముద్రాలలో క్షీరసముద్రముకీర్తి, యశోవైభవముకలిగి జగద్వ్యాపకమైన కీర్తిని కలిగియున్నది ఒక్క చుట్ట అనే చెప్పవలసి వస్తుంది.

చుట్ట తాగడమువలన అనేక ప్రయోజనములు సిద్ధిస్తూ ఉన్నవి. రాజకీయాలలో శేముషీ ధురంధరుడైన చర్చిల్ చుట్ట త్రాగడమువల్లనే అసమానమైన ప్రజ్ఞను సంపాదించినట్లు జగద్విదితము.

వేదులపల్లి, కాటూరి ప్రభృతులు చుట్ట తాగుతూఉన్న కారణానే, మహాకవులైనట్లు మనము ఊహించవచ్చును.

చుట్టను ముట్టించి విలాసంగా పొగను వదలి, వర్తులాకారమైన చిన్నచిన్న మేఘమండలాన్ని సృష్టించగా అవి మంద మంద గతిని ఆకాశంలో విహరిస్తూ ఉంటే, పంక్తులుగా నిలిచిన బలాకములవలెనూ, బిసకిసలయములను పాథేయముగా గొని మేఘుని వెంట కైలాసమునకై పోవుచున్న రాజహంసలవలెను కనిపిస్తవి.

అదీకాక, ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం వప్రకీడా పరిణత గజప్రేక్షణీయం దదర్శ, అనే శ్లోకపాదంకూడా జ్ఞాపకం వస్తుంది.

చుట్ట మనస్సుకు కలిగిన వ్యాకులతను పోగొడుతుంది. ఆకలి కటను తీరుస్తుంది. దాహాన్ని ఉపశమింపజేస్తుంది. విరహార్తులను శమింపజేస్తుంది.

చుట్ట తాగడమువలన కలిగే ఆనందము, మధురమైన కావ్యమును చదివినపుడూ, ప్రియురాలు చెంపపై చిటికవేసి సరసోక్తులు ఆడే టప్పుడూ కలిగే ఆనందముతో సమానమైనది అని చెప్పవచ్చును.

కోపము ద్వేషము మొదలైన మనోవికారాలను పోగొట్టడానికి చుట్టవంటి వస్తువు ఇంకొకటి లేదు.

మిత్రునివలె ఆదరించేది, ప్రియురాలివలె లాలించేది, తల్లివలె బుజ్జగించేది ఒక్క చుట్టే కాని మరొకటి కాదు.

ఈ వ్యాపారము ఒక్కటే పీయూషపానమువలె మధురమైనదీ, శరద్రాత్రివలె మనోహరమైనదీ అయిఉన్నది.

కాబట్టి మనము అందరమూ కూడా ఈ చుట్టకు ప్రణతి శిరస్కులము కాకతప్పదు.

చుట్టయొక్క మహాత్మ్యమునూ, పరువమునూ, ప్రయోజనమును గుర్తింపని కొందరు నాస్తికులు, దానినిగురించి అపభాషణ చేస్తూ ఉండటము చాలా శోచనీయము.

హే చుట్టే, అహంత్వాం ఉపాసే తమసోమా జ్యోతిర్గమయ.

---

# వ్యర్థప్రయత్నము

## "రహస్యము బయటపెట్టకూడదు"

మనము జీవితంలో అనేక వ్యర్థ ప్రయత్నాలు చేస్తూ ఉంటాము.

సిగరెట్లు మానెయ్యాలని మనలో ఎందరో ఎన్నివిధాలో ప్రయత్నము చెయ్యడమూ, మానెయ్యలేకపోవడమూ జరుగుతూ ఉంటుంది.

నా స్నేహితులలో ఒకతను కారాకిళ్లీ అలవాటు చేసుకొంటే సిగరెట్ అలవాటు పోతుందని అనుకొని కారాకిళ్లీ అలవాటు చేసుకొన్నాడు. కాని, ఏమీ లాభం లేకపోయింది. కిళ్లీ అలవాటు ఒకటి క్రొత్తగా అతుక్కున్నది.

ఇటువంటి వ్యర్థప్రయత్నాలు ఎన్నో జరుగుతూంటవి. కొందరు కాఫీ మానివెయ్యాలని ప్రయత్నంచేసి, మళ్ళీ కాఫీ లోకి వస్తూంటారు.

ఇల్లాగ అనేక విషయాలలో మన నిశ్చయాలను నిలుపుకోలేక పోవడము జరుగుతుంది. మనకు ఏవైనా వ్యసనాలు ఉంటే, ఆ వ్యసనాలు మనపై ప్రభుత్వం స్థాపించుకొని ఉంటవి. ఆ ప్రభుత్వానికి మనము దానిసలమై ఉంటాము. ఆ దానిసత్వాన్ని వదిలించుకోలేము.

అవి మనపైన ఎందుకు ప్రభుత్వం సాగిస్తున్నవీ అంటే, ఆయా విషయాలలో ఆ వ్యసనాలను వదలించుకోలేకపోవడమునకు కారణము ఈ దౌర్బల్యమే.

రహస్యం బైటపెట్టకూడదు అని నిశ్చయించుకొని, ఆ నిశ్చయాన్ని నిలుపుకొనలేక పోవడానికి కారణంకూడా ఒక రకము దుర్బలత్వమే. అదే నేను చెప్పదలచుకొన్న విషయం.

అయితే, ఏది రహస్యము అని ప్రశ్న వస్తుంది. ఏది రహస్యమో ఏది కాదో వ్యక్తిగత నిర్ణయంపై ఆధారపడి ఉంటుంది.

కొంతమందికి వారి జీవితానికి సంబంధించిన ప్రతి విషయమూ రహస్యమే. తమను గురించి ఏ విషయము బైటపడితే ఏమి కొంప మునుగుతుందోనని అనుమానం. ఏదీ బైట పడనీయరు. బహు గుట్టుగా బ్రతుకుతారు.

గంభీర హృదయం అనుకొనేవారిలోనే ఇటువంటి భయము ఎక్కువగా ఉంటుంది. ఏ విషయమైనాసరే, రహస్యం కానీ కాకపోనీ ఇతరులకు ఎందుకు చెప్పాల్లే అని వాళ్ళు అనుకొంటారు

ఇల్లాగ ప్రతి విషయమూ పరమ రహస్యంగా భావించే వాళ్ళ మనస్తత్వమును పరిశీలిస్తే వాళ్ళకు అనుమానం ఎక్కువ అన్న విషయము బయటపడుతుంది. ప్రపంచాన్ని చూస్తే భయం. ప్రతివాడు తనను మోసగించడానికి ప్రయత్నిస్తున్నట్లు విపరీతమైన అనుమానం. అందుకనే వాళ్ళు అల్లాగ మాట్లాడుతారు ఆటువంటివాడు, తన కోసం ఎవరైనా వస్తే ఇంట్లో ఉండికూడా లేడని చెప్పిస్తాడు.

ఎవ్వరికీ తమ విషయమై ఏమీ తెలియనీయకుండా తమ పనులు తాము చేసుకోవడములో గొప్పతనము ఉన్నదని చాలా మంది అభిప్రాయము

తాను అన్నం తిన్నట్టుగాని, ఉనసట్టుగాని ఎవ్వరికీ తెలియ నీయరు. తమ కెంత పొలము ఉన్నదీ తెలియనీయరు. ఎంత అప్పు ఉన్నదీ తెలియనీయరు. అంతా రహస్యమే. ఈ విష యాలు ఏవీ చస్తే ఇతరులకు తెలియనీయకుండా కాపాడు కుంటారు. చనిపోయాక తెలుస్తుంది అతనికి "చచ్చేటంత అప్పు ఉన్నదని" అప్పుడు అతని బ్రతుకంతా బయటపడుతుంది.

ఇది రహస్యాలు దాచేవాళ్ళ సంగతి. ఇంకో రకం మను ష్యులు ఉన్నారు. వాళ్ళకు రహస్యం అంటూ ఏదీ ఉండదు. అంతా బట్టబయలే. ఇంట్లో భార్యతో పోట్లాడిన సంగతి కూడా అందరికి చెప్పేస్తారు.

రహస్యం దాచలేకపోవడము ఒక విధమైన దౌర్బల్యం. స్త్రీలలో ఈ దౌర్బల్యం ఎక్కువగా ఉంటుందంటారు. తమకు తెలిసిన సంగతి ఎవరితోనో ఒకరితో చెప్పనిది వాళ్ళ కేమీ తోచదు. "విన్నావా ఒదినా! కాంతమ్మత్తయ్య కోడలుకు మళ్లీ కొడుకో కూతురో!....మళ్ళీ ఆవిడతో అనబోకు, జానకమ్మ అక్కయ్య నిన్న నాతో రహస్యంగా అన్నది" అంటుంది ఒకావిడ.

ఈ రహస్యం విన్న ఆవిడ "నా కెందుకు వదినా, ఒకరి సంగతి అసలు పట్టించుకోను" అని, ఆ రాత్రికి ఎట్లాగో కడు పులో పెట్టుకొని మరునాడు ప్రొద్దున్నే మదురుగోడ దగ్గరకెళ్ళి రత్తమ్మను పిలిచి, ఈ సంగతి కాస్తా ఆమెగారి చెవిలో ఊదు తుంది.

రహస్యం కడుపులో పెట్టుకోవడము చాలా కష్టము. తనకు తెలిసిన సంగతి ఎవరితోనైనా ఏదోవిధంగా చెప్పిన దాకా పిచ్చి

పిచ్చిగా ఉంటుంది. దాచాలని ప్రయత్నముచేసినా అది వ్యర్థ ప్రయత్నమే అవుతుంది ఈ చెప్పడము స్పష్టంగా తగినన్ని మాటలలో చెప్పకపోయినా ఏదో సూచనగా అయినా అనక తప్పదు.

నేను ఏరహస్యమూ దాచలేను. రహస్యాలు దాచాలని అనేక సార్లు ప్రయత్నం చేసి విఫల మనోరథుణ్ణి అయినాను.

ఒకసారి మా అమ్మాయికి పిల్లనిద్దామనే ఉద్దేశంతో ఒక పెద్దమనిషి మా ఇంటికి రావడము తటస్థించింది. మా ఆవిడ నన్ను గదిలోకి పిలిచి ముందుగానే చెప్పింది. ''చూడండి! ఆయనతో కాస్త జాగ్రత్తగా మాట్లాడండి. పిచ్చిగా మాట్లాడ బోకండి'' అన్నది.

"అంటే ఏమిటి నీ ఉద్దేశం, నేను ఎందుకు పిచ్చిగా మాట్లాడు తాను నాకు పిచ్చి ఇంకా ఎక్కలేదుగా, ఎక్కిందంటావా?'' అన్నాను విసుగ్గా.

''అదిగాదండీ! ఆ వచ్చిన పెద్దమనిషితో మన సంసారపు గుట్టు ఏమీ చెప్పక కాస్త దర్జాగా మాట్లాడండీ.''

''మనకు ఉన్న గుట్టు ఏమిటి? ఏమి చెప్పకూడదో కాస్త తెలిసేటట్లు చెప్పరాదూ!'' అన్నాను.

''మనకు ఆస్తి ఏమీలేదనీ. అప్పుల్లో ఉన్నామనీ, ఈ విష యాలు కాస్త రహస్యంగా ఉంచండి. ఆయనతో అనబోకండి. అదీ నే ననడము; ఇప్పుడు తెలిసిందా'' అని విసుక్కున్నది.

నేను నవ్వి, ''అదా నీ వనడము! ఈ విషయాలు ఎందుకు చెబుతాను....చస్తే చెప్పను, బహు గుట్టుగా ఉంచుతాను. చూస్తావుగా....'' అన్నాను.

నేను ఇంతగా చెప్పినా, ఆవిడ నమ్మినట్లు లేదు, ఏదో అను మానం కడుపులో పెట్టుకొన్న దానివలె నావంక చూస్తూ, "ఊరికే అనడము కాదు, మన రహస్యాలు లాగాలని ఆయన అనేక రకాల ప్రశ్నలు వేస్తాడు. మీరు జాగ్రత్తగా జవాబు చెప్పండి. "సంసారం గుట్టు, రోగం రట్టు" అన్నారు. మనకు అప్పు ఉన్న సంగతి బైటపడకూడదు: బహు జాగ్రత్త" అని మళ్ళా హెచ్చరించింది.

ఆవిడ మళ్ళీ మళ్ళీ చెప్పిందే చెప్పడము చూస్తే నాకు ఒళ్ళు మండిపోయింది. "ఎందుకూ అన్నిసార్లు చెబుతావు! నేను మన ఇంటి రహస్యాలు అన్నీ బయటపెడతాననేగా అనుకోవడము.... అసలు నేను తెలివితక్కువవాణ్ణే అనే నీ అనుమానం" అన్నాను పెద్దగా.

"నాకు అనుమానం ఏమిటండి అనుమానం లేనేలేదు". అని పకపకానవ్వి "కాస్త జాగ్రత్తగా ఉండురూ మీకు పుణ్యం ఉంటుంది" అని మరోసారి చెప్పి వెళ్ళిపోయింది.

ఆయన వచ్చాడు. కూర్చున్నాడు. ఏవో ఆ సంగతులూ, ఈ సంగతులూ, మాట్లాడుతున్నాడు. అడ్డగోలు ప్రశ్నలన్నీ వేస్తున్నాడు. నన్ను చెప్పవద్దన్న విషయాలు ఎక్కడ జారవిడుస్తానో అని భయపడుతూనే ఉన్నాను. ఎంతసేపని జాగ్రత్త వహించగలను. ఎప్పుడు నాలుక నోట జారి, ఏ మాటా అనుకొచ్చిన అవస్థ ఇది—మాకేమీ అప్పులేదు. కొత్తే కూడా ఆస్తి ఉన్నది—అని ముందుగానే చెప్పేస్తే పోతుందని అనుకొన్నాను కూడా.... తలుపుచాటున ఆవిడ కూర్చుని మా సంభాషణ వింటున్న మూలాన నేను ఆ కాస్త మాట మొదటనే అనలేక పోయినాను.

ఆయన కొంచెంసేపు అయినతరువాత అసలు విషయానికి రానే వచ్చాడు. ''మీకు ఆస్తి ఏమైనా ఉందాండి'' అన్నాడు.

అబ్బ! అంత సూటిగా ప్రశ్న అడిగితే ఎట్లా, ఏమి చెప్పేది? చూస్తూ చూస్తూ అబద్ధం ఆడలేను. అయినా 'ఆస్తి లేదని చెప్పకండి' అని ఆమె ముందుగానే గోలపెట్టిందాయె!

ఏమి చేసేది? సరే, ఏమైనా కానీమనీ అబద్ధం చెప్పాను. "ఆస్తి ఉందా?'' అంటే ''ఉన్నది" అన్నాను.

నేను మనస్సులో ఒక టనుకొన్నాను. ఆస్తి అంటే ఎదైనా ఆస్తే. రెండు ట్రంకు పెట్టెలూ. బీరువానిండా పుస్తకాలూ ఇదంతా ఆస్తిక్రింద లెక్కే. ఆర్థికశాస్త్రరీత్యా—

ఆర్థిక శాస్త్రంలో సంపాదించే శక్తి, నలుగురిలో పలుకుబడీ ఇదంతా ఆస్తే అంటాడు.... కాబట్టి నేను అబద్ధం ఆడడము లేదని మనస్సుకు ఒక తృప్తి కలిగించుకొన్నాను.

ఆయన నాకు ఆస్తి ఉందిగదా అని తెలుసుకొని సంతోషించి ఊరుకోలేదు. మీ ఆస్తి ఎక్కడుందన్నాడు. 'ఇక్కడే ఉంది' అన్నాను. ఇప్పుడూ నేను అబద్ధం ఆడింది ఏమీలేదు, నా ఆస్తి అంతా పక్కగదిలోనూ, వంట ఇంట్లోనూ ఉండె.........ఇక్కడే ఉందంటే తప్పులేదు.

నాకు చాలా సంతోషం కలిగింది. గర్వమును కూడా పొంది నాను. ఎందుకూ అంటే, మా ఆవిడ చెప్పినట్లు దర్జాగానూ మాట్లాడుతున్నాను. ఇంటిరహస్యాలు ఏమీ బైటపెట్టడమూ లేదు. నేను అంత తెలివిగా మాట్లాడినందులకు నాకే సంతోషంగా ఉన్నది. నన్ను నేను అభినందించుకొన్నాను.

ఆయన వదలలేదు. ఇంకా ప్రశ్నలు వేయసాగినాడు. అబద్ధం ఆడలేను. "మీకు పొలాలు ఉన్నవా!" అన్నాడు. ఏమని చెప్పేది? "ఉన్నవి" అంటే, ఏవూళ్ళో అని అడగడూ? ఏదో ఊరు పేరు చెపితే ఆ ఊరు వెళ్ళి కనుక్కోడూ? ఛా! అబద్ధం ఆడలేను. పొలాలును లేవు అన్నాను. పొలాలు అన్న మాట సాగ దీస్తూ అంటే పొలాలుగాక ఇంకేవో ఉన్నాయని ఆయనకు తోచేలాగున.

ఇంతవరకు ఇంటిగుట్టు ఒక్కపిసరైనా బైట పెట్టలేదుగదా అని అంతా అనుకొని మళ్ళీ సంతోషించాను.

కాని. ఆయన వదిలేటట్టు లేదు. మళ్ళీ ప్రశ్నలు!

పొలాలు లేకపోతే ఇళ్ళు ఉన్నాయా మీకు? అని అడిగాడు.

ఏమీ చెప్పేది? ఇల్లెక్కడున్నది? అద్దెఇంట్లో ఉంటూ ఉంటిని! ఇల్లు ఇంకాకొనలేదు అన్నాను—ముందుముందు కొనేటట్లు, అటువంటి ఆలోచనలలో ఉన్నట్లూ....

ఇంతవరకు బాగానే ఉన్నది. మా ఇంటిగుట్టు బైటపెట్టకుండానే కొట్టుకొచ్చాను. అట్టే అబద్ధాలు ఆడలేదు. తెలివిగా మాట్లాడడము అంటే అదేకదా.... అనుకొన్నాను.

అంతటితో ఆ సంభాషణ ఆగిపోతే బాగుండేది. ఆయన ఇంకా ఏమి అడుగుదామా అని ఆలోచించి, "అయితే, మీ ఆస్తి అంతా ఏరూపంలో ఉందని" నిలవదీసి అడిగాడు. చికాకువేసింది. "ప్రస్తుతం మా ఆస్తియావత్తూకూడా అప్పురూపంలో ఉన్నది" అన్నాను.

తలుపు చాటున కూర్చుని నా మాటలన్నీ వింటూ ఉన్న మా ఆవిడ, ఈ చివరిమాట విని నెత్తి బాదుకొని లేచి పోయింది.

ఆ తరువాత కాసేపటికి ఆయనకూడా నవ్వుతూ మర్యాదగానే సెలవు పుచ్చుకొన్నాడు.

సంభాషణను బహు నేర్పుగా నడిపినానని నేను లోలోన సంతోషించాను.

ఆయన వెళ్ళిన తరువాత, ఆవిడవచ్చి "అప్పు సంగతి రహస్యంగా ఉంచండి, బైట పెట్టకండి అని నెత్తిన నోరు పెట్టుకొని అరచినా మీరు వినలేదు. ఎట్లా ఏడ్చేదండిబాబూ!" అన్నది.

నే నన్నానూ, "నీవు ఏమీ ఏడ్వవద్దు; నేను అప్పు ఉందని స్పష్టంగా చెప్పలేదు, అబద్ధం ఆడకుండానే ఆయనకు మన యందు గౌరవభావం కలిగే లాగున చేశాను. ఆస్తి ఉన్నదని అన్నాను కాని లేదనలేదుగా! ఆస్తి అనేది ఏ రూపంలో ఉన్నా చివరకు అప్పురూపంలో ఉన్నా ఉన్నట్లే గదా....ఆస్తి అనేది అనేక రూపాలలో ఉండవచ్చు. అప్పు అనేది ఆస్తి వుండదగిన ఒకరూప విశేషము" అని ఎన్ని చెప్పినా ఆమె కేమీ నమ్మకం కలుగక, "మీరు రహస్యం బైటపెట్టారు. ఈ విషయం అందరికీ తెలుస్తుంది. ఇక మన పిల్లాడికి పిల్లను ఎవ్వరూ ఇయ్యరు" అని గోల పెట్టింది.

ఆమె అన్న మాటలు నిజమే నని నాకు ఇప్పుడు తోస్తున్నది. ఆస్తి అంతా అప్పు రూపంలో వుందిఅంటే, వాళ్ళు ఏమనుకొంటారు, ఎంతో అర్థశాస్త్రజ్ఞానం వుంటేనేగాని అప్పు కూడా ఆస్తి అన్న సంగతి తెలియదు.

ఇంతకూ నేను రహస్యం దాచలేకపోయాను. అదీ సంగతి. నా ప్రయత్నం అంతా వ్యర్థమై పోయింది.

రహస్యం దాచలేకపోవడము ఒక దౌర్బల్యమే ఐనా, అది జీవితానికె మాధుర్యమును ప్రసాదించే దౌర్బల్యము

రహస్యమును బైటపెట్టకుండా వుండగలగడము ఒక గొప్ప విషయమే కావచ్చు. కాని, రహస్యాన్ని బయల్పడకుండా వుంచడానికి ప్రయత్నము చేయడమూ. చివరకు అప్రయత్నంగా బయటపడడమూ—దీనిలో ఒక సుందరమైన అనుభూతి యున్నది; మాధుర్యమున్నది.

మానవునియొక్క వ్యర్థప్రయత్నాలలోనూ. తద్గతమైన మానసిక దౌర్బల్యం ప్రదర్శనంలోనూ, ఏదో మనలను సంతోష పెట్టే పదార్థము వున్నది బలం గల మానవుణ్ణి చూచి దూరంగా నిలువబడి నమస్కరిస్తాము. దుర్బలుడైన మానవుణ్ణి కౌగలించు కొంటాము. ఇతడు మనకు సన్నిహితుడు. మన సానుభూతిని సంపాదిస్తాడు. మన హృదయాన్ని ఆకర్షిస్తాడు....దౌర్బల్యం లోనే సౌందర్యం వున్నది.

# జ్యోతిషం

జ్యోతిశ్శాస్త్రం అబద్ధమని నేనెప్పుడూ అనలేదు. అననూ అనను. జ్యోతిశ్చక్రము మానవుని జీవితంపైన కొంత ప్రభావం కలిగివున్నమాట కూడా నేను కాదనను. గ్రహాల ప్రభావ ప్రాబల్యాల వలన ఒక్కొక్క మనిషి జీవితం ఒక్కొక్క రకంగా నడుస్తుం దన్నమాట కూడా నిజమే

గ్రహాలూ, నక్షత్రాలే గాక సృష్టిలో వున్న జంతువులూ, పక్షులూ కూడా మానవ జీవితానికి సంబంధం కలిగియున్నవి అనుకోవడము శాస్త్ర చాదస్తము అని మాత్రం అంటాను.

గుడ్లగూబను చూచి మనము భయపడతాము. పిట్టపారితే పసిపిల్లలకు జబ్బుచేస్తుం దనుకుంటాము. రాత్రిళ్ళు తీతువుపిట్ట కూస్తే మన కేదో ఆపద సంభవిస్తుందని భావిస్తాము. ఇల్లాగ ప్రతిపక్షీ మనకేదో చేస్తుం దనుకోవడము వెర్రి అనే చెప్పవలసి వస్తుంది.

కొన్ని పక్షులవల్ల కీడు కలుగుతుందని ఎల్లాగ అనుకుంటామో, అల్లాగే కొన్ని పక్షులవలన మేలుకలుగుతుందని కూడా మనము అనుకుంటూ వున్నాం.

మనము ఎక్కడికయినా ప్రయాణమై పోతున్నపుడు మనకు కుడి ప్రక్కగా పాలపిట్ట పోతే మనకు జయం. కాకి ఎడమ ప్రక్కన పోవాలి.

పక్షులే కాదు, జంతువులు కూడా మనకు జ్యోతిషము చెబుతవి. పిల్లి ఎదురుగా వచ్చిందా ఆపని పాడు. కుక్క ఎదురుగా

వస్తే మరేమీ నష్టంలేదు. నిద్ర లేవడంతోటే ఆవు యొక్క పృష్ఠభాగం చూస్తే పుణ్యము.

జంతువర్గం అయిపోయింది. ఇక మనుష్య వర్గంలో ఒంటి బ్రాహ్మణుడు ఎదురుగా రాకూడదు శూద్రులు వస్తే మంచిది కూడాను.

ప్రయాణమై పోతున్నపుడు పుణ్యస్త్రీ ఎదురుగా రావడం అన్నివిధాలా మంచిది.

ముత్తయిదువ ఎదురుగా రాకపోవచ్చునని అనుమానం కలిగినప్పుడు ఎవరినైనా బ్రతిమలాడి మనకు అభిముఖంగా వచ్చే లాగున చేసికోవలసి వుంటుంది. పక్కయింటి ఆవిడ, రజక స్త్రీ, తాంబూలక స్త్రీ, గాయక స్త్రీ, కన్నెముత్తయిదువ—వీరిలో ఎవరైనా ఎదురుగా రావచ్చు.

అటువంటి సందర్భాలలో పక్కయింటి ఆవిడను "అమ్మా! అట్లా వెళ్ళి నాకు ఎదురుగా రావలసింది. నీకు పుణ్యం ఉంటుంది" అని బ్రతిమలాడుకోవడము ఒక పద్ధతి. ఆవిడ దయతలచి సరే అంటుంది.

ఒక్కొక్క భాగ్యశాలి, "ఛా, ఛా నీ ఎదురుగా వచ్చిందాకా నాకేం ఖర్మ, నేను రాను. అంత అవసరమైతే నీవే నాకెదురుగా రా" అంటుంది. అట్లాగూ చెయ్యవచ్చు.

ఎదురుగా రాకపోతే పోనీ పక్కగా రమ్మనవచ్చు ఒక్కొక్కప్పుడు ఇవన్నీ లాభించవు. ఎవరో పుణ్యాత్మురాలు నీ వెనకాల వస్తూ వుంటుది. అప్పుడేమి చెయ్యాలా అంటే గిరుక్కున వెనక్కు తిరిగి ఆమెకు అభిముఖంగా వెళ్ళి, శకునం, బాగుం

దని తృప్తిపడి, ఆ తరువాత కొంత దూరం పోయి, మళుపు తిరిగి అసలు దారికే నెమ్మదిగా రావలసి వుంటుంది. శకునం కోసం ఎన్ని విధాల తిప్పలైనా పడుతూ వుంటాము.

ఇంకో ఉపాయం కూడా వున్నది. ఒకరిని రమ్మంటే, ఇల్లాంటి యిబ్బందులే వస్తూ వుంటవి. కాబట్టి స్వంత భార్యనే ఎదురుగా రమ్మంటే ఏ చిక్కూ వుండదు.

ప్రతివాడికీ తన ఆయుష్షు ఎంత వున్నదీ తెలుసుకోవలెనని కోరిక చాలా గాఢంగా వుంటుంది. అందుకని జ్యోతిష్కుని దగ్గరకు వెళ్ళి, "నా ఆయుష్షు ఎంత అండీ?" అని అడుగుతాడు. అంతకంటే తెలివితక్కువ ప్రశ్న యింకోటి వుండబోదు. ఒకవేళ తొందరలో మరణము వున్నా ఏ దైవజ్ఞుడూ మనకు ఆ విషయం చెప్పడు.

నా స్నేహితుడు ఒకాయన ఇల్లాగ జ్యోతిష్కుని దగ్గరకు వెళ్ళి, "నా కెంత ఆయుర్దాయం వుందండీ?" అని అడిగాడు.

ఆ దైవజ్ఞుడు జాతకాన్ని పరీక్షించి, "అసలు యీ విషయంలో మీకు సందేహం ఎందుకు కలిగిందీ? శని అష్టమంలోనూ, గురుడు కోణంలోనూ వుంటూ ఈ జాతకునికి డెబ్బై ఏండ్ల ఆయుర్దాయాన్ని యిస్తున్నారు" అన్నాడు.

ఆ తరువాత సంభాషణ యిల్లాగ జరిగింది;

"అయితే నేను డెబ్బయి యేండ్లు బ్రతుకుతానన్న మాట?"

"రాయిలాగా!"

"ఈమధ్య చావనన్న మాటేగా?"

"చస్తే, చావరు."

"అసలు చావనన్న మాట!"

"బొత్తిగా చావవు. ఎవరైనా కావాలని చంపితే తప్ప."

"అదేమిటండోయ్?"

"ఎవరైనా చంపుతారని కాదయ్యా! నీవు బుద్ధిపూర్వకంగా చావవు."

"బుద్ధిపూర్వకంగా ఎవరైనా చస్తారా? ఏం మాటలయ్యా యివి?"

జ్యోతిష్కుడికి కోపం వచ్చి, "అంటే నీకు చచ్చే యోగం లేదు. కాని ఒకవేళ చావు అంటూ వస్తే మాటవరుసకు అంటున్నాను. ఎవరైనా చంపితే చావలిసిందే గాని, నీ అంతట నీవు చావవు" అని.

మా వాడికి యీ గొడవ ఏమీ బోధపడటంలేదు. "అసలు చావనే కూడదు గాని, చచ్చినతరువాత ఎట్లా చస్తే ఎవరిక్కావాలె! అయినా, ఈయన దగ్గరకు రావడము నాదే బుద్ధితక్కువ. నా చావు నేను చావక!" అని విసుక్కొని ఇంటికి వచ్చివేశాడు.

జ్యోతిష్కుడు, తన దగ్గరకు వచ్చినవాడికి అప్రియం ఎప్పుడూ చెప్పడు. ప్రస్తుతం వున్న బాధలు, చిక్కులూ కూడా కొద్దిరోజులలో తొలగిపోతవి అని కూడా అంటాడు. ఇది ఒక విధంగా మంచిగానే పరిణమిస్తుంది. ఈ ఆశతో మనిషి తన బాధలను ధైర్యంగా ఎదుర్కొనగలుగుతాడు. దాని తరువాత ఆ చిక్కులు ఎల్లాగూ తొలగిపోతవి. జ్యోతిష్కుడు చెప్పినమాటల వలన, మనిషి, కాస్త పుంజుకుని నిలబడ గలుగుతాడు.

అయితే, ఒక్కొక్కప్పుడు జ్యోతిష్కుడు చెప్పేమాటల వలన తేనిపోని చిక్కులలో తగుల్కొనడం కూడా సంభవిస్తూ వుంటుంది.

నా సంగతే చెబుతాను. ఒకసారి జ్యోతిష్కుడు నాకు ఇల్లా చెప్పినాడు: "ఓహో! గొప్ప యోగంగల జాతకం అండీ, ఇది? ధన స్థానంలోనూ, ఏకాదశంలోనూ వర్గోత్తమాంశను పొందిన శుభ గ్రహాలున్నారు. ఈ జాతకునికి అయాచితంగా అతర్కితంగా అజ్ఞాత ప్రదేశాన్నుంచి అపారమైన ధనం లభిస్తుంది. తప్పదు" అన్నాడు. ఇది బహుశా లాటరీలో డబ్బు వచ్చే యోగం అనుకున్నాను.

అనుకొని అప్పట్నుంచి కనపడ్డ లాటరీ టిక్కెట్టల్లా కొన్నాను. ఒక వందరూపాయల దాకా ఇందుకోసం ఖర్చుపెట్టినాను, జ్యోతిషము నందు గట్టి నమ్మకం వుండడముచేత తప్పక లాభం కలుగుతుందని ఆశపడ్డాను.

ఆ తరువాత వస్తే గిస్తే ఎంత వస్తుందీ అనికూడా ఆలోచించాను ఒక ఇరవై వేలు రావచ్చునని తోచింది.

ఊరికే కోరుకునేప్పుడు ఇరవై వేలు మాత్రమే ఎందుకు కోరుకోవాలె. లక్ష రూపాయలు ఎందుకు కోరుకో లేదు—అని అడిగినా సమాధానం వున్నది.

ఇల్లాంటి డబ్బు గ్రహబలంవల్లా, దైవ కృపవల్లా రావాలె. ఇరవై వేల కంటే యెక్కువ మొత్తం కోరుకుంటే, అంత పెద్ద మొత్తం నాకు లభించేంతటి గ్రహబలం వున్నదో లేదో అన్న సందేహం ఒకటి!

అదీగాక లక్ష రూపాయలు రావాలని కోరుకుంటే వీడికి ఎంత ఆశరో అని భగవంతుడే అనుకోవచ్చు. అందుకని కోరు కునేటప్పుడు ఏదో సంసార పక్షంగా ఇరవైవేలతో సరిపెట్టు కుంటే మంచి దనుకున్నాను.

డబ్బు తప్పక వస్తుందని తోచేసరికి, అది ఏవిధంగా ఖర్చు పెట్టవలెనా అని అన్న ఆలోచనలు కూడా రాసాగినవి.

చక్కని యిల్లొకటి కట్టించాలనీ, అందులో పిల్లలకూ, నాకూ, మా ఆవిడకు వేరు వేరు గదులు వుండాలనీ నిశ్చయించి ప్లానులు కూడా వేసాను.

ఆ ప్లానులు మా ఆవిడకు చూపిస్తే ఆవిడ "ఇంత పెద్ద యిల్లు కట్టడానికి డబ్బు ఎక్కడిదండీ?" అని అడిగింది. నేను లాటరీ టిక్కెట్టు కొన్న విషయం చెప్పి, ధనయోగం వున్నదనీ, తప్పక డబ్బు వస్తుందనీ చెప్పినాను.

ఆవిడ, ఎంతో సంతోషిస్తుం దనుకున్నాను. కాని, ఆవిడ ఏ మాత్రమూ సంతోషించక పోవడమేగాక పైగా ముక్కూ మూతీ విరిచి, "అయ్యో అయ్యో! మనముఖాలకు అంత అదృష్టమూ అంది.

ఆ తరువాత డబ్బు రాలేదు. నా టికెట్ నంబర్ బహుమతి పొందిన టికెట్ నంబర్లలో లేదు. అక్షరాలా ఆవిడ చెప్పినట్లే జరిగింది.

నేను గబగబా వెళ్ళి, "ఏమయ్యా రాలేదే" మని అడిగాను.

ఆయన తెల్లబోయి, అంతులేని ఆశ్చర్యాన్ని ప్రకటించి మరొకసారి జాతకం చూచి, "ఏమబ్బా ఎందుకు రాకపోవాలె. రావలసిందేనే! అందులో జన్మలగ్నాన్ని చూస్తున్న గురుడు

ఉచ్చంగతుడై వున్నప్పుడు ధనలాభం కలిగి తీరాలె. ఎక్కడో మిస్టేక్ వచ్చింది" అన్నాడు.

"మిస్టేక్ కాదు, నా ముఖం కాదు. అసలు మా ఆవిడ అననే అన్నది. మన ముఖాలకేనా అంత అదృష్టం అని! మీ మాటయందు నమ్మకం పెట్టుకొని డబ్బు తగలేశాను." అన్నాను నేను విసుగ్గా.

నా మాటలు విని ఆయన గుడ్లు పెద్దవిచేసి నా వంక చూస్తూ అన్నాడు: "ఇంకేం అట్లా చెప్పు. ధనయోగం వున్నదే, ఎందుకు లాభించలేదా అని నేను యిందాకట్నుంచి కొట్టుకు చస్తున్నాను. ఇప్పుడు తెలిసింది అదీ సంగతి! మీ ఆవిడ ఆ మాట అనకుండా వున్నట్లయితే వచ్చేది."

"ఆమెగారు ఏదో అంటే మటుకు వచ్చే అదృష్టం వెనక్కి పోతుందయ్యా! అయినా ఆవిడ మటుకు ఏమన్నది? మన ముఖాలకేనా అంత అదృష్టం అన్నది, అంతేగా!" అన్నాను నేను.

"అది చాలునయ్యా బాబు, ఆ మాట అనకుండా వుండాల్సింది. మన ముఖాలకేనా అనడములో తన ముఖం కూడా కలుపుకొన్నది. దాని వలననే పోయింది. నీ ఒక్క ముఖానికే అయితే వచ్చినట్లు రావలసింది. రాకపోవడం ఎల్లా సంభవం? గురుడు యోగించాడయ్యా. రవి ఉచ్చగతుడై యున్నాడు. రవి బుధులు మీదపడి తంతూ వుంటే ధనయోగం పట్టి తీరాల్సి వుంది. ఆవిడ తన ముఖం కూడా కలుపుకునే టప్పటికి వచ్చిన యోగం కాస్తా తిరోభావము అయినది.

ఈ మాటలు అంటూ ఆయన నాకు ధనయోగం పట్టక పోవడానికి సరియైన కారణం కనిపెట్టినట్లు తృప్తితో నిండిన చూపులు చూశాడు.

మా ఆవిడపై నింద వేశాడని మొదట్లో కాస్త కష్టంగా వున్నా, చివరకు ఆయన అన్నమాటే నిజం అనిపించింది.

ఎందుకంటే, అనేకసార్లు నాకు న్యాయంగా రావలసినయోగం మా ఆవిడ మాటలవలననే పోయినట్లు అప్పుడు జ్ఞాపకం వచ్చింది.

ఒక పాఠశాలకు హెడ్ మాస్టరు కావాలని ప్రకటన చేశారు. నేనూ ఒక అప్లికేషన్ పెట్టాను. ఆ ఉద్యోగం నాకు రావచ్చునని ఆశపడ్డాను.

నిజం మాటకొస్తే. హెడ్ మాస్టరు కావటానికి నాకు ఉన్నన్ని అర్హతలు ఎవ్వరికీ లేవు. చీటికీ మాటికీ కోపం రావడమూ, మొండి వాదనలు చేయడమూ, సహోపాధ్యాయులపై ఎగిరి పడడమూ ఇవన్నీ నాకు తెలుసు. అవకాశం ఇస్తే అసిస్టెంట్లను హడలగొట్టగలను.

ఇన్ని అర్హతలు ఉన్నవి కదా ఆ పదవి నాకు రాకపోతుందా అని అనుకొని ఆ సంగతి మా ఆవిడతో అన్నాను.

అసలు నేను అనేవాణ్ణికాదు. ఒక రోజున బజారుకు వెళ్ళి కూరలు తెమ్మన్నది ఆవిడ. అప్పటికే ఉదయం తొమ్మిది అయింది. నేను వెంటనే కదలక పోవడము చూచి ఆమె విసుక్కుంటూ ఉంటే నేనే అన్నాను, "నాకు హెడ్ మాస్టరీ అయితే ప్రొద్దున్న ఆరుగంటలకే నీవు మన నౌకరును మార్కెట్టుకు

పంపి, కావలసిన చీరలు తెప్పించుకొందువుగాని నీవే, నాలుగు రోజులు ఓపిక పట్టు'' అని !

ఈ మాటమీద ఆవిడ చేతులు ఝాడిస్తూ, ''ఆ! మన ముఖాలకు హెడ్‌మాస్టరుగిరి కూడాను అయ్యో! అయ్యో!

అంత అదృష్టం కూడానా!'' అన్నది.

ఆవిడ అన్నట్టే అయింది. ఆ ఉద్యోగం వాళ్ళు నా ముఖం చూచి, ఇది హెడ్‌మాస్టరు ముఖంగాదనుకొన్నారో ఏమో నాకు మటుకు ఉద్యోగం ఇయ్యలేదు. మళ్ళీ నేను అసిస్టెంటు ముఖం తోనే ఇంటికి వచ్చేశాను.

ఆమె మన ముఖాలకేనా అన్నమాట వాడకపోయినట్లయితే ఎట్లాగుండేదో !

మళ్ళీవెళ్ళి ఆజ్యోతిషుని బ్రతిమిలాడాను ఎట్లాగయినా నాకు హెడ్‌మాస్టరు అయే యోగం పట్టించుమని.

ఆయన మళ్ళీ గుణించి, నా జాతకంలో ఏ దోషం లేదనీ, మా ఆవిడకే హెడ్‌మాస్టరుగారి భార్య అయ్యే యోగం లేకుండా ఉండవచ్చుననీ చెపుతు నీవు వున్న ఇంటిలో ఏదైనా దోషమున్నా, ఇల్లా జరుగవచ్చు. వాస్తు శాస్త్రరీత్యా ఆ యింట్లో దోషమున్నదో ఏమో కర్మం; నీ ఇల్లు పాంచాల వాలములో ఉండాలె. ఉన్నదా? అయినా, ఇల్లు మారు చూద్దాం, ఏం జరుగుతుందో'' అని చెప్పాడు.

ఆ రోజులలో ఇల్లు మార్చడము అంటే సామాన్యపు పని కాదు. ఎల్లాగో కష్టపడి మరో వీధిలో రెట్టింపు అద్దెకు మరో ఇల్లు మాటాడుకుని అందులో ప్రవేశించాను.

అద్దె ఎక్కువ ఇయ్యడము కష్టమేనని తోచింది కాని ఎట్లాగా హెడ్‌మాస్టరును అవుతాను, అయితే ఇంకో వందరూపాయలు ఎక్కువ రానేవస్తవి గదా అని అనుకొని సరిపెట్టుకొన్నాను.

ఇప్పుడు కొత్తగా కుదుర్చుకొన్న ఇల్లు, చాలా దర్జాగా కూడా ఉన్నది. రేపు తీరా హెడ్‌మాస్టరును అయి కూర్చున్న తరువాత ఇల్లాంటి ఇల్లు రమ్మంటే వస్తుందా, ముందుగానే జాగ్రత్త పడ్డాను కాబట్టి సరిపోయింది. అని కూడా మనస్సుకు సమాధానం చెప్పుకొన్నాను.

సరే, అనుకొన్నట్లే, మళ్ళీ పత్రికలలో ప్రకటనలు వచ్చినై హెడ్‌మాస్టర్లు కావాలని!

ఈ దఫా దీక్షితులుగారు "సీకు గహస్థితి చాలా అనుకూలంగా ఉందయ్యా వచ్చి తీరుతుంది. నీ కెందుకు ప్రయత్నం చెయ్యి" అన్నారు! అప్లికేషనులు పంపాను.

ఒకచోటనుంచి జవాబు వచ్చింది! నన్ను చూడాలట వారు. రమ్మన్నారు. ఏమిటి నన్ను చూచేది! సరే, రమ్మన్నారు కదా అని బయలుదేరినాను.

హెడ్‌మాస్టరుకోసం ప్రయత్నం చేసేవాడు మూడవ తరగతిలో సామాన్య మానవులతో కలిసి కూర్చోవటము ఏమిటి అనిపించింది.

హెడ్‌మాస్టరు కానూలేదు, పెట్టనూ లేదు, అవుదామని అనుకొనేసరికి, ఆ పదవిని ఆశ్రయించుకొని వున్న వికారాలన్నీ నన్ను పట్టుకొన్నవి. నాతోడి సహోపాధ్యాయులను చూస్తే నాకప్పుడే కొద్దిగా అసహ్యం ఏర్పడటం ప్రారంభం అయింది. ఏమిటి వీళ్ళ వట్టి దద్దమ్మలు అధమం హెడ్‌మాస్టరు పదవి

కోసం ప్రయత్నమన్నా చేయరేం! అని అనుకొన్నాను. వాళ్ళకంటే ఒకమెట్టు నేను పైనే ఉన్నట్టు తోచింది నాకు.

ఇన్ని మాట లెందుకూ, రైల్లో ఆ సెకండు క్లాసులో పరుపుపైన బెంచీని అంతా ఒకణ్ణే ఆక్రమించుకొని కూర్చున్నప్పుడు నా చూపుల్లో ప్రధానోపాధ్యాయునికి వుండదగ్గ ఉచితమైన గాంభీర్యము వచ్చేసింది.

ఇంకా ఏవేవో భావాలు నా హృదయంలో సంచరింప సాగినవి. ఉద్ధృతము, లలితత్వము, శాంతత్వము నాలో ప్రవేశించినవి. సకలమైన సుగుణాలు నాలో ప్రవేశిస్తున్నట్లు, తోచింది. అసలు నేను మనిషి అడుగు అడుదున్నర ఎత్తులో పెరిగినట్లు తోచింది.

శోభ, విలాసము, మాధుర్యము, గాంభీర్యము ధైర్యము, స్థైర్యము, తేజస్సు, లాలిత్యము అనే సుగుణాలు, తోసుకు తోసుక వచ్చి నాలో ప్రవేశించినవి.

అసిస్టెంటు మాష్టర్ల బ్రతుకుపైనే రోతపుట్టుకొస్తున్నది.

సరే ఇది వదిలేసి అక్కడ ఏమి జరిగిందీ చెపుతాను.

సాయంత్రం నాలుగు గంటలకు నేను స్కూలుకు వెళ్ళాను, నాకు ఉద్యోగం ఇయ్యనున్న అధికారులను కలుసుకోటానికి.

వాళ్ళు మర్యాదగా మాట్లాడి తప్పకుండా నా విషయమై ఆలోచిస్తామని చెప్పి పంపించినారు. నేను రిటైరు అయినాను గాని వారి ఆలోచించడము ఇంకా పూర్తికావేదని తోస్తుంది.

ఇంతకు ఆయన చెప్పిన జ్యోతిషం మళ్ళీ తప్పింది. ఈ దఫా మంచి కోపం వచ్చి, ఆయనను చీవాట్లు వేద్దామని

దృఢనిశ్చయంతో వెళ్ళి, "ఏమయ్యా! నీవు చెప్పింది అంతా అబద్ధం అయింది" అన్నాను.

ఆయన ఆశ్చర్యపోతూ, "హెడ్‌మాస్టరు కోసం చేసిన ప్రయత్నాలలో ఇది ఎన్నో ప్రయత్నం?" అని అడిగాడు....
"రెండవది!" అన్నాను.

"అయితే ఇదివరలో కూడా ఒక ప్రయత్నం ఫలించ లేదన్నమాట!" అన్నాడు ఆయన ఆశ్చర్యపడుతూ.

ఆయనకు నేను చేస్తూఉన్న ప్రయత్నాల విషయమై ఏమీ జ్ఞాపకం లేనట్లు నటిస్తూ ఉంటే, నాకు ఒళ్ళు మండిపోయింది. "మీకు ఏమీ జ్ఞాపకం లేదా, క్రిందటి జూన్ నెలలో కూడా మీరు ప్రయత్నం చేయమంటే చేశాను. లాభించలేదు." అన్నాను.

"అప్పుడు నీ ప్రయత్నము ఫలించక పోవటానికి కారణం ఏమని చెప్పాను?" అన్నాడు.

"ఆ చెప్పావు వెధవకారణం! మన ముఖాలకేనా ఆ అదృష్టం అని నా భార్య అంటే, నా ఒక్క ముఖానికి అయితే ఆ అదృష్టం కలిసి వచ్చేదనీ, ఆవిడ "మన" అని ఆమె ముఖం కూడా కలపబట్టి నాకు హెడ్‌మాస్టరు పదవి రాలేదని అన్నావు. దాని తరువాత ఇల్లు మార్చమన్నావు. మార్చాను కూడా! అయినా నీ జ్యోతిషం తప్పింది" అన్నాను.

నేను కోపంగా అంటూ ఉన్న మాటలన్నీ ఆయన శాంతంగా విని, "అవునయ్యా ఇప్పుడు నీవు చేయగలిగిందిగాని, నేను చేయగలిగింది కాని ఏమీ లేదయ్యా!" అన్నాడు.

నాకు ఏమంటానికి తోచలేదు. దిక్కుముఖం పెట్టి ఇల్లు మార్చమంటే మార్చాను కదండి !" అన్నాను.

ఇల్లుమారిస్తే నేమయ్యా, ఇల్లు మారిందిగాని, ఇల్లాలు మారిందా ! ఆ యిల్లాలు ముఖం కూడా కలవటం వల్లనే నీకు కలిసి రావటము లేదు, ఇంతకూ మీ ఆవిడకు హెడ్ మాస్టరుగారిభార్య" అని అనిపించుకునే యోగం లేదయ్యా, శుక్రుడు వక్రించాడు !" అని విసుక్కుని పంపి వేసినాడు.

ఆ తరువాత నేను ఈ జ్యోతిషుల చుట్టూ తిరగడము మాని వేశాను.

అయితే, జ్యోతిశ్శాస్త్రిన్ని నేను అవహేలన చేస్తున్నానని ఎవ్వరూ అనుకోవద్దు. ఆ శాస్త్రింవల్ల కలిగే ప్రయోజనము పరిమితము. జీవితానికి సంబంధించిన కొన్ని ప్రధానవిషయాలు జ్యోతిశ్శాస్త్రంవల్ల తెలుసుకోవచ్చు. జ్యోతిషులు జీవిత గమనాన్ని సూచించగలరు. అంతేగాని ప్రతి చిన్నవిషయాన్నీ అనగా జీవిత స్రవంతిపోయే మార్గంలోని ప్రతి వంపును, మలుపును వారు చూపగలరని అనుకొనడము వట్టి భ్రమ.

వ్యక్తియొక్క గాఢమైన ఇచ్ఛ గ్రహబలాన్ని కూడా జయించగల శక్తి గలిగినది.

జీవిత కష్టాలు సంప్రాప్తమైనప్పుడు, జ్యోతిషుని దగ్గరకు పరుగెత్త నక్కరలేదు. ఈ కష్టాలు కలకాలం వుండవు. ముమ్ముందు మంచి రాగలదు. అని గట్టిగా విశ్వాసాన్ని కలిగి ఉండటం వలన చాలా ప్రయోజనం ఉన్నది.

జ్యోతిషం కూడా ఇటువంటి విశ్వాసాన్ని మనలో పెంపొందించటం చేస్తుంది. కొద్ది కాలంలో మంచిరోజులు వస్తవి అని,

జ్యోతిషుడు సాధారణంగా చెపుతాడు. అది చాలా మంచిమాట. నిజముకూడాను. చీకటి వెనకాలే వెన్నెల వుంటుంది. కష్టాలు కాపురం చెయ్యవు. పడి పోయిన గోడలు పడిపోయినట్లే ఉండవు.

ముందు రానున్న మంచియందు విశ్వాసముంటే మనిషి కష్టాలను ధైర్యంతో ఎదుర్కొన గలుగుతాడు. జ్యోతిషుడు ఒకవేళ చెడు సంభవింపబోతున్నది అని చెప్పినా మనము అధైర్య పడ కూడదు. మనకు మనోబలం అంటూ ఒకటి ఉన్నది. దానివలన మనము గ్రహబలాన్ని కూడా జయించగలము.

గ్రహబలాన్ని కూలద్రోయాలన్న కోరిక బలమైనది కావాలె. అప్పుడు తత్వాంఛా సిద్ధికై మనము కృషిచేసి జయమును సాధించగలుగుతాము.

కాబట్టి గ్రహబలం ఎట్లాగయినా ఉండనీ వాటిస్వభావము నిరవధికము నిర్జేయము కానీ, మనంమాత్రం బుద్ధి బలంచేతనే కార్య సాధన చేయగలము అనుకోవడము శ్రేయస్కరము.



# చమత్కార సంభాషణ

ఛల వాదాలు తర్కహితమైన వాదనలు కావు—ఇవి కుత ర్కానికి సంబంధించినవి. ఇంగ్లీషులో వీటిని ఫాలసీస్ అంటారు.

ఛలము అంటే ఏమిటి? "ఒక అభిప్రాయముతో జెప్పిన పదమునకు మరియొక అభిప్రాయము చేసికొని ఉత్తరము చెప్పుట ఛలము" అని శబ్దరత్నాకరంలో ఉన్నది. న్యాయ దర్శ నంలో అర్థాంతర కల్పనచే వాది వాక్యాన్ని ఆక్షేపించడము ఛలము అని చెప్పబడి యున్నది.

ఛలము తర్కహితమైన వాదన కాదన్న మాట జ్ఞాపక ముంచుకొనవలెను. ప్రతిపక్షుని వాక్యంలో ఉండే తర్కహితము గాని విషయాన్ని చూపి అతని మతాన్ని ఖండించి స్వమతాన్ని స్థాపించుకొనడము వాదము. ప్రతిపక్షి వాక్యాన్ని ఎదుర్కొన డానికి మంచి యుక్తి స్ఫురించక ఆ వాక్యంలో ఏదో ఒక మాటను అర్థాంతరము కల్పించి హేళన చేయడము ఛలము. మొత్తము మీద ఛలము అనేది ఒక రకము వెక్కిరింపు. హేళన చేయడమే ప్రధానమైన ఉద్దేశంగా పెట్టుకొని వాక్య కల్పన చేస్తాడు ఛలవాది.

జల్ప వితండాలకు, ఛలానికి భేదం కూడా గుర్తిస్తే మనము ఛల స్వరూపాన్ని గురించి పూర్తిగా తెలుసుకొనిన వారము అవుతాము. కాబట్టి వాటిని గురించి కూడా ఒకటి రెండు వాక్యాలు ఇక్కడ వ్రాయవలసి వచ్చింది. స్వమత స్థాపనము

జల్పవాది యొక్క ప్రధానోద్దేశము. పరపక్ష నిరాకరణకు మాత్రము ఉపయోగపడే కథకుల వాక్య సముదాయానికి వితండ మని పేరు. ఛలవాదికి స్వపక్ష స్థాపనము గాని, పరపక్ష నిరాకరణగాని ఉద్దేశములు కావు. అర్థాంతర కల్పనచే వాది వాక్యాన్ని ఆక్షేపించి హేళన చేయడమే అతని పని.

ఒకడు వాది వాక్యాలలో నుంచి ఛలము సాధించినాడు అంటే అర్థము వాది వాక్యాలలో ఉన్న ఒకానొక దౌర్బల్యాన్ని గుర్తించినా డన్నమాటే. కాబట్టి అల్లాగ ఛల సాధనకు వీలు లేని పద్ధతిలో కథకుడు వాదము నడుపవలెనని గుర్తించవలసి ఉన్నది. అప్పుడే వాదము బిగువు అవుతుంది. తాడు పేనేవాడు దానికి బాగా పురిపెట్టి తెంపితే తెగని పద్ధతిలో పేనినట్లే, వాది తన కథకు బాగా పురిపెట్టినట్లయితే అనగా అర్థాంతరము కల్పన చేయడానికి వీలులేని పద్ధతిలో పద ప్రయోగమూ, వాక్య నిర్మాణమూ కూర్పు చేర్పు చేస్తే ఛలము సాధ్యము కాకుండా పోతుంది.

ఈ ఛల వాదాలవల్ల ప్రయోజనము ఏమిటి అన్న ప్రశ్నకు సమాధానం చెబుతున్నాను. వైదిక మత సిద్ధాంతాలను రక్షించ డానికి జల్పవితండ, ఛలవాదాలు ఉపయోగించ వచ్చునని న్యాయ దర్శన గ్రంథకర్త అంటాడు.

అది ఎంతవరకు సాధ్యమో నాకు తెలియదు. నాకు తెలిసిన విషయము ఒకటి ఉన్నది. ఈ ఛలము చాలా చమత్కార జనకంగా ఉంటుంది. చాలా హాస్యానికి ఈ ఛలవాదాలలో చోటు ఉన్నది. ఆ కారణము చేతనే నేను ఈ రకము వాదాలను గురించి

వ్రాస్తున్నాను. ఛలమును సాధించడములో నిశితమైన మేధాశక్తి ప్రదర్శితము అవుతుంది. రసజనకమైన స్వాస్త్యము వుంటేగాని ఛలము సాధ్యంకాదు. అది ఒక ప్రత్యేకమైన ప్రజ్ఞ. ఛల మతి సంభాషణను మనోహరము చేయగలదు. అట్టి ఉపలబ్ధి కలవాడు సమాజంలో రాణిస్తాడు. ఛల ప్రయోగాలు సంభాషణలో క్షణ ప్రభలవలె భాసిస్తవి. జీవితానికి ఆనందాన్ని ఇస్తవి.

ఛలము ప్రధానంగా మూడు రకములు. వాక్ఛలము, సామాన్య ఛలము, ఉపచార ఛలము అని. మన ప్రాచీన తర్క శాస్త్రంలో ఈ మూడు రకాలే ఉన్నవని నేను అనుకొంటున్నాను. యాంఫిబోలీ, ఫాలసీ ఆఫ్ డివిజన్, ఫాలసీ ఆఫ్ కాంపోజిషన్ అనేవి పాశ్చాత్య తర్క శాస్త్రంలో ఉన్నవి. అవి కూడా ఈ ఛల వాదాలలో చేర్చినాను. ఇప్పటికి ఆరు రకముల ఛలవాదాలు ఏర్పడినవి. వీనికి తోడు కాక్వాక్షిప్త ఛలము అనునది నేను ఒకటి చేర్చి మొత్తము ఏడు రకముల ఛలాలను సాధించినాను.

ఈ జల్ప, వితండ, ఛలవాదాలకు ఇంగ్లీషులో ఫాలసీస్ అని అంటారు. ఇంగ్లీషు తర్కశాస్త్రంలో నుంచి ఈ రకము వాదనలను గురించి వ్రాసిన ఒక్క వాక్యము ఉదహరించి ఈ ప్రకరణము ముగిస్తాను. "ఫాలసీ అంటే సమాప్తమైనట్లు కనిపించినా, సమాప్తం కాని వాదం. అలాంటి వానివి తొలగించుకునేందుకే ముఖ్యంగా మనం వీనిని తెలుసుకోవాలి." ఈ ఛల వాదాలు ఇంగ్లీషులో సెమిలాజికల్ ఫాలసీస్ అనే శాఖకు చెందినవి. అందులో భాషకు సంబంధము కలవి కాబట్టి వీటిని ఇంగ్లీషులో ఫాలసీస్ ఇన్‌డిక్షన్ అంటారు. ఇక ముందు

ఈ ఛల వాదాలను తీసుకొని ఒక్కొక్క దానిని గురించి విపులంగా చెప్పుటకు ప్రయత్నిస్తాను.

రెండు మూడు అర్థాలు వచ్చే పదాన్ని వాది తన వాక్యంలో ఉపయోగిస్తే ఛలవాది ఏం చేస్తాడు అంటే వాదికి సమ్మతమైన అర్థాన్ని విడిచిపెట్టి ఆ వాక్యానికి వేరొక అర్థం కల్పిస్తాడు. ఈ విధంగా వాది వాక్యాన్ని ఆక్షేపించడాన్నే వాక్ఛలము అని అంటారు.

న్యాయ దర్శనంలో వాక్ఛలము అంటే ఏమిటో చెప్పుటకు ఈ ఉదాహరణ ఇచ్చినాడు. వటువు క్రొత్త కంబళము కలవాడనే అభిప్రాయంతో నవకంబలోయం మాణవకః అని వాది అన్నాడట. నవకంబలము అంటే తొమ్మిది కంబళ్ళు కలవాడు అని కూడా అర్థం వస్తుంది. ఇది పట్టుకొని ఛలవాది వాడికి తొమ్మిది కంబళ్ళు ఎక్కడివి? ఉన్నది ఒకటే కదా అని అన్నాడట. ఇదే వాక్ఛలము అంటాడు న్యాయదర్శన గ్రంథకర్త. నవ అనే పదానికి రెండు అర్థాలు ఉండడమువలన ఈఛలము సాధ్యమైనది. న్యాయ దర్శన గ్రంథకర్త ఇచ్చిన ఉదాహరణ వాక్ఛలము అంటే ఇల్లా ఉంటుంది అని చూపడానికి పనికివచ్చినా అది ఏమంత మనోజ్ఞంగా గాని, రసవంతంగా గాని లేదని నాకు తోచింది, అందుకని మరికొన్ని క్రొత్త ఉదాహరణలు ఇస్తున్నాను. ఈ ఉదాహరణలు కల్పించడం వల్లనే నేను ప్రాచీన తర్కశాస్త్రానికి మెరుగులు దిద్దుతున్నానూ అని అనుకొంటున్నాను. కాకపోతే చెప్పండి పండితులైనవారు అని ప్రార్థిస్తున్నాను కూడాను.

అవిశేషాభిహితేర్థే వక్తు రభిప్రాయాదర్థాంతర కల్పనా వాక్ఛలమ్.

ఒకరు ఇల్లాగ అన్నాడు. ఏమని అంటే పక్షులు ఎగురుతవి అని ; వెంటనే ఛలవాది నిన్న నీవు నామీద ఎగిరావు, కాబట్టి నీవు పక్షివి అన్నాడు. ఇది కాస్త హాస్యంజనకంగా ఉన్నది.

ఆమెకు తలచెడింది : కన్యాశుల్కనాటకంలో గిరీశం వెంకటేశంతో అంటాడు : "ఎమోయ్ వెంకటేశం, మీ అక్కయ్యకు తలచెడినట్లుందే !" అని వెంకటేశం అమాయకంగా మా అక్కయ్య తలదువ్వుకోదండీ అని జవాబు చెపుతాడు. వెంకటేశం తెలిసి అనలేదు కాని ఇక్కడ తలచెడింది అనేమాటకు అర్థాంతరం కల్పించబడినది. ఇది వాక్ఛలము.

ఒక పండితుడు ఉన్నాడు. ఆయనకు పళ్ళు ఊడిపోయినవి. ఒక కవి ఈ పండితుని విషయమై మాట్లాడుతూ ఈయన పతితద్విజుడూ అన్నాడట. పతితద్విజుడూ అంటే పళ్ళు ఊడిపోయిన బ్రాహ్మణుడు అనే అర్థమే కాక చెడిపోయిన బ్రాహ్మణుడు అనే అర్థంకూడా వస్తుంది. ఇది వాదము ఎట్లాఅయింది ; వాది ఒకమాట అనడమూ. ప్రతిపక్షి వాది వాక్యంలో ఏదో ఒక మాటకు అర్థాంతర కల్పన చేయడము లేదే అని ఆశ్చర్యపడవద్దు. సంభాషణలో ఉపయోగింప బడిన చమత్కారము ఇది. ఇది కూడాఛలమే. వాద రూపము కావాలంటే కల్పించవచ్చు. పతితద్విజుడు అనేమాటమీద ఛలించింది. వెంకటశాస్త్రిగారు ఎవరిని ఉద్దేశించి అన్నారో జ్ఞాపకంలేదు. ఇకముందు ఇయ్యబోయే ఉదాహరణలు కూడా వాదరూపంలో ఉండవు. అంతమాత్రంచేత అవి ఛల వాదాలుగా ఉదహరించడం సరిపోలేదు అని భావించవద్దు. ప్రతి ఉదాహరణ వాది, ప్రతివాది వాక్యాలుగా మార్చవచ్చును.

ఇల్లాంటి చమత్కారాన్ని వాక్ఛలము అని అంటారు. మామూలుగా శ్లేషార్థాన్ని తీయడంకంటే ఇదేమీ ఎక్కువైనది కాదు. అలంకార శాస్త్రంలో ఈ వ్యాపారాన్ని శ్లేష అంటారు. ఇల్లాగ వెడ అర్థంతీసి, కొంచెం వెక్కిరింపుగా అన్నట్లయితే దాన్ని తర్కంలో ఛలము అంటారు. హేళన చెయ్యాలనే ఉద్దేశంతో శ్లేషార్థం తీస్తేనే అది ఛలం అవుతుంది.

కపులు పిచ్చివాళ్ళు. ఈతడు పిచ్చివాడు కాబట్టి ఈతను కపి అని వాదించడముకూడా ఛలవాదమే. ఎందుకూ అంటే పిచ్చి వాళ్ళు అనేమాట మొదటి వాక్యంలో అమాయకుడు అనే అర్థంతో వాడి, రెండవ వాక్యంలో మతిపోయినవాడు అనే అర్థంతో వాడినాడు కథకుడు.

రెప్పలు ఆర్చనివారు (అనిమిషులు) దేవతలు అంటే చచ్చిపోయినవారు రెప్పలార్చరు కాబట్టి వారు దేవతలు అని వాదించడం ఛలవాదము.

ఇంకొక ఛలవాది సంగతి చెబుతున్నాను. ఆయన కుమారుడు చనిపోయినాడు. అప్పుడు అతడు విచారంలో ఉండికూడా అవకాశం వచ్చినపుడు ఛలోక్తి వాడకుండా ఉండలేక పోయినాడు. ఆ కథ ఇది. ఆ చనిపోయిన వ్యక్తిని మోసుకొనిపోవడానికి వాహకులు ఎవ్వరూ దొరకలేదట. అప్పుడు తండ్రి "మావాడు బ్రతికి ఉన్నప్పుడూ నిర్వాహకుడే, చనిపోయినా నిర్వాహకుడే" అన్నాడట. నిర్వాహకుడు అనే మాట శ్లేషింపబడినది.

కోతలు కోసేవాళ్ళు, తెలివైనవారు అంటే, ఇంకొకరు వ్యవసాయ కూలీలు కోతలు కోస్తారు కాబట్టి వాళ్ళ చాలా తెలివైన

వాళ్లు. అని వాదించినాడు. ఇక్కడ కోతలు అనే పదం శ్లిష్టమైనట్లు తెలుస్తూనే ఉన్నది. ఈ ఉదాహరణ బంద్ర గంటాయము.

ధ్వని పౌష్కల్యం పండిత కవుల లక్షణం అని నేను అంటే, మా అబ్బాయి గురకలో ధ్వని పౌష్కల్యం ఉన్నది కాబట్టి మా అబ్బాయి దగ్గర పండిత కవుల లక్షణాలున్నాయి అన్నాడు జమదగ్నిశర్మ.

కాటూరు వెంకటేశ్వరరావుగారు రాత్రి పడుకొనబోయేముందు రెండు చుట్టలు చుట్టుకొని ప్రక్క బల్లపై పెట్టుకొని మరీ నిద్ర పోయేవాడు. ఎందుకంటే అవి ఇప్పుడు కాల్చరుగదా అంటే ఆయన ఇల్లాగ అన్నారు: ''రేపు ప్రొద్దుటికి కావాలయ్యా నిద్ర లేవడంతోనే చుట్టుకోవడం చికాకుగా ఉంటుంది. అందుకని ఇప్పుడే చుట్టుకొని అట్టిపెట్టుకొంటాను. ఆదీకాక ఇది మంచి ఆచారం. గొప్పవాళ్ళంతా అల్లాగే చేస్తున్నారు. ఆదిశేషువు కూడా ఇల్లాగ చేసేవాడు. చుట్ట చుట్టుకొని పరుండె—అని ఉన్నది అన్నారు. ఇది మనోజ్ఞమైన వాక్ఛలము.

ఒక వాక్యంలో ఉన్న మాటలను ఒక కూర్పులో చదివితే ఒక అర్థమున్నూ, మరియొక కూర్పులో చదివితే వేరొక అర్థమున్నూ రావడం కద్దు. ఇల్లాగ అర్థాంతరమును కల్పించి విపరీతమైన వాదనను లేవదీయడం సామాన్య ఛలము అంటారు. ఇల్లాగ అర్థాంతరమును కల్పించడంలో అనేక మార్గాలు ఉన్నవి. [1] రెండు వాక్యాలకు లేని సంబంధాన్ని కల్పించి విపరీతార్థం తీయవచ్చు. [2] లేక ఒక వాక్యంలో

ఉండే శబ్ద సముదాయంలో ఏదో ఒకదానికి ప్రాధాన్యం ఇచ్చి నొక్కి సంకటమువలన విపరీతార్థం ఉపపన్నం కావచ్చును. ఈ మార్గముల వివక్షితార్థము ఈ క్రింది ఉదాహరణల వలన గమ్యం కాగలదు.

ఒక పల్లెటూరులో ఉన్న డాక్టర్ చాలా సమర్థుడు అని చెప్పదలచి ఒకసారి నేను ఇల్లాగ అన్నాను. "ఆయన ఆసుపత్రిని చాలా వృద్ధిచేసినాడు. ఎన్నో మందులు తెప్పించినాడు. ఆసుపత్రికి ఒక భవనం కట్టించినాడు. ఒక కాంపౌండరునూ, ఒక మంత్రసానినీ కూడా నియమించినాడు. ఆయన క్రొత్తగా వచ్చినపుడు రోజుకు పదిమంది రోగులైనా ఉండేవారుకారు. ఇప్పుడు రోజుకు యాభై అరవైమంది రోగులు మందు పుచ్చుకొంటున్నారు." ఈమాటలు వింటూఉన్న నా స్నేహితుడు వి. ఎల్. ఎన్ గారు అయితే రోగులు ఎక్కువ కావడమేనా ఆయన సామర్థ్యానికి ఫలితం ! అని ఆక్షేపించినాడు. ఇది సామాన్య ఛలానికి ఉదాహరణ. ఆయన సామర్థ్యానికీ, రోగులు ఎక్కువ కావడానికీ సంబంధంలేదు. లేనిచోట సంబంధాన్ని కల్పించి ఛలోక్తి పలికినాడు. హాస్య జనకమైన చిత్తవృత్తిఉంటే ఈ రకము ఛలాన్ని చమత్కార సాధనకై వినియోగించ వచ్చును.

ఒకసారి నేనూ, నా మిత్రుడు వేదుల సత్యనారాయణ శాస్త్రి ఒక నాటకము చూడడానికి వెళ్ళినాము. నాటకము మొదట్లో ఏమంత బాగుండలేదు. "నేను నిద్ర ఆపలేకుండా ఉన్నాను. నాటకము ఏమంత బాగుండలేదు. వెళ్ళి పడుకొంటానయ్యా" అనిచెప్పి శాస్త్రి వెళ్ళిపోయి పడుకొన్నాడు. నేను మాత్రము

అక్కడే కూర్చున్నాను. మొదట్లో బాగుండక పోయినా, తరువాత తరువాత నాటకము బాగుంది. మరునాడు మళ్ళీ మేము ఇద్దరమూ కలిసినప్పుడు నేను శాస్త్రితో అన్నాను. "నీవు వెళ్ళిన తరువాత నాటకం రక్తికట్టిందయ్యా'' అని. ఆమాటమీద శాస్త్రి ''అవునవును. రక్తికట్టాలనే నేను వెళ్ళిపోయినాను" అన్నాడు. అతడు వెళ్ళిపోవడానికీ నాటకం రక్తికట్టడానికీ ఏమాత్రం సంబంధము లేకపోయినా కార్యకారణ సంబంధం కల్పించి ఫలమును సాధించినాడు శాస్త్రి.

ఒకసారి వార్తాపత్రికలో ఒకదాని క్రింద ఒకటిగా ఈ రెండు శీర్షికలు పడ్డవి. ఒకటి మొక్కపాటి నరసింహశాస్త్రిగారు: విజయవాడలో మహోపన్యాసము. రెండు: విజయవాడలో దొంగతనాలు ఎక్కువగా జరుగుతున్నవి. ఈ రెండునూ ఒకదానితో ఒకటి సంబంధము లేని వేరు వేరు విషయాలు. మా శాస్త్రి ఈ రెండింటికీ సంబంధము కల్పించి ఏమందోయ్ చూశారా, మొక్కపాటివారి ఉపన్యాసానికి ఫలితంగా దొంగతనాలు ఎక్కువ అయినవి అని కూర్చుచేసి నవ్వించినాడు. పైన చెప్పిన మూడు ఉదాహరణలలోనూ, లేని సంబంధమును కల్పించడము వలననే సామాన్య ఫలము అనబడే చమత్కారము జనిస్తున్నది.

ఒక హెడ్ గుమాస్తా మరొక చిన్న గుమాస్తాను గురించి పై అధికారితో ఇల్లాగ అన్నాడు. ''ఆ చిన్నవాడు డబ్బుకోసం చాలా ఇబ్బంది పడుతున్నాడు. పాపం అతనికి ఈ మధ్య వివాహంకూడా అయింది. ఆ అధికారి విచారమును సూచించే

ముఖముపెట్టి'' పాపం మన మేమి చేస్తాము. ఆఫీసు బయట సంభవించే ఆపదలకు మన మేమీ బాధ్యులము కాము అన్నా డట!'' పాపం, పెండ్లికూడా అయింది అంతే అక్కడ ప్రాకరణికార్థము అతనికి ఖర్చు ఎక్కువ అయిందీ అని, అధికారి అదేదో ఆపదగా భావించి, పెడఅర్థం తీసి ఛలమును సాధించాడు. ఈ విధంగా చెప్పవలసిన అర్థము కాక మరియొక అర్థమును సాధించడమే ఈ ఛలమునకు ఉపాశ్రయము.

ఈ సామాన్య ఛలము రెండు ప్రకరణాలవల్ల సాధ్యము అవుతూ ఉన్నది. లేని సంబంధమును కల్పించడము ఒకటీ, లేని అర్థమును తీయడము ఒకటీ! పైన చెప్పిన పెళ్ళిని గురించి కథలేని అర్థాన్ని తీయడానికి ఉదాహరణ. ''వాది తాత్పర్యము నకు విరుద్ధార్థమును కల్పించుట సామాన్య ఛల మనబడును'' అని న్యాయ దర్శనంలోని వాక్యము. ఇలాగ లేని అర్థాన్ని తీయడానికి ఇంకొక మార్గము కూడా ఉన్నది. అది ఏమిటీ అంటే, ఒక వాక్యములో ఉండే ఏదో ఒక పదమునకు ప్రాధాన్యమిచ్చి నొక్కడము వలన, ఆ పదమునకు ఉండే అర్థమునకు విరుద్ధమైన మరొక అర్థము స్ఫురించి, ఛలము సాధింపబడుతుంది.—ఈవిధంగా ప్రతిపాదిత మయ్యే సామాన్య ఛలానికి రెండు మూడు ఉదాహరణలు ఇస్తున్నాను,

ఇరుగు పొరుగు వారితో మంచిగా ఉండవలెనూ అంటే, ''అంటే. ఇంటికి దూరంగా ఉన్నవాళ్ళతో మంచిగా ఉండ నక్కర లేదనేగా మీ అభిప్రాయం'' అని ఛలము సాధించినాడు మా లక్ష్మణస్వామి.

"శ్రీరాముడు పితృవాక్య పరిపాలనార్థం పదునాలుగేండ్లు వనవాసం చేసినాడు. కాబట్టి తండ్రిమాట వినవలెను'' అంటే-. తల్లిమాట వినవరె నని ఎక్కడా లేదన్న మాటేగా, అని వెక్కిరించినాడు నా తోడి ఉపాధ్యాయుడు సూర్యప్రకాశరావు.

ఒక ఉపాధ్యాయుడు మరియొక ఉపాధ్యాయునితో అన్నాడు: ''మనము విద్యార్థుల దగ్గరనుంచి నేర్చుకోవలసింది చాలా ఉన్నదీ అని!" ఆ రెండవ ఆయన వెంటనే అన్నాడు. ''అయితే మనము చెప్పవలసింది ఏమీ లేదన్న మాటేగా !'' అని.

ధర్మ వికల్ప నిర్దేశే అర్థ సద్భావ ప్రతిషేధ ఉపచార ఛలమ్— అన్నాడు శాస్త్రకారుడు. శబ్దమున అర్థ బోధక వృత్తులు రెండు ఉన్నవి. ఒక శక్తి. రెండు లక్షణ. ఇందు శక్తి ముఖ్య వృత్తి. లక్షణ గౌణవృత్తి. ఇట్టి రెండు వృత్తులలో ఒక దానిని మన సులో పెట్టుకొని, వాదిచే ప్రయోగింపబడి శబ్దమునకు మరి యొక దానితో ఆ అర్థమును కాదనుట ఉపచార ఛల మనబడు నని సూత్రాభిప్రాయము.

పైన చెప్పిన సూత్రము గాని, సూత్రార్థముగాని అర్థం కానక్కరలేదు. ఈ క్రింద ఇచ్చిన ఉదాహరణ వలన ఉపచార ఛలము అంటే ఏమిటో చక్కగా తెలుస్తుంది. ఉదా:—1—ఏదో ఒక విషయము చెపుతూ, ఆ వార్త విని వూరంతా ఏడ్చింది అంటాము. అంటే వూరు ఎట్లా ఏడుస్తుంది అని పక్కవాడు ఆక్షేపిస్తే అది ఉపచార ఛలము అయింది.

ఉదా: 2—ప్రతాపరుద్రీయంలోనుంచి మరొక ఉదాహరణ ఇస్తాను. ''జయశీలుడు అయిన కాకతి భూపతి పటహ ధ్వనిని

విని సామంత నగరములు ఆక్రోశిస్తున్నవి" అని ఒక వాక్యము ఉన్నది. ఆ మాట విని ప్రతిపక్షి నగరములు ఎల్లాగ ఏడుస్తవి ? నగరానికి ప్రాణం ఉన్నదా, నోరు ఉన్నదా అని వెక్కిరిస్తే అల్లాంటి వెక్కిరింపుకు ఉపచార ఫలము అని పేరు. నగరము ఏడుస్తున్నదీ అంటే నగరస్థిత జనులు ఆక్రోశము చేస్తూ ఉన్నారు. అని అర్థము అన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే !

లక్షణ శక్తినే ఇంగ్లీషులో ఒక శబ్దాలంకారంగా పరిగణిస్తారు. ఆ అలంకారానికి మెటానిమీ అని పేరు.

దేశము తిరుగుబాటు చేసిందీ అంటే దేశములోని ప్రజలు అన్న మాట. దేశము ఎల్లాగ తిరుగుబడుతుందీ అని ఆక్షేపించ డము ఉపచార ఫలము అయింది.

ఉపచార ఫలము అంటే ఏమిటో అని భయపడ్డాము కాని, తీరా చూస్తే ఏమీలేదు. మనము రోజూ మాట్లాడుకొనే మాట లలో ఇల్లాంటి వ్యాపారము జరుగుతూనే ఉంటుంది. వాన్ని తర్కంలో ఉపచార ఫలము అని అంటారని మనకు తెలియదు అంతే. పండ్లు అమ్మ వచ్చిన మనిషితో మనము—ఆ బుట బుట్ట ఎంత కిస్తావు అని అడుగుతాము. అప్పుడు కూడా బుట్టలో ఉన్న వస్తువులు అర్థము కదా ! ఇదే లక్ష్యార్థ మంటే.

ఇంతకూ కొన్ని శబ్దాలకు వాచ్యార్థమనీ, లక్ష్యార్థమనీ వుంటవి.

కైంకర్యం చేసేవారు భక్తులు, దొంగలు వస్తువులను కైం కర్యం చేస్తారు, కాబట్టి దొంగలు భక్తులు. కైంకర పదము

వైష్ణవ మత పరిభాషకు చెందినది కాబట్టి దొంగలు విష్ణు భక్తులు అని కూడా అనవచ్చును. ఇల్లాగ వాదించడము ఉప చారఛలము ఎల్లాగ అయిందీ అంటే కైంకర్యము అనే మాట మొదట వాచ్యార్థంలోనూ, తరువాత వ్యవహారంలో రూఢమైన మరొక అర్థంలోనూ వుపయోగింప బడుటవలన ఇక్కడ ఉప చార ఛలము సాధ్యము అయినది.

ఒకసారి నేనూ, శాస్త్రీ సినిమాకు వెళ్ళినాము. పైక్లాసు టిక్కెట్లే కొనుక్కున్నాము. మేడపైకి వెళ్ళి కూర్చొన్నాం. మేడ పైకి వెళ్ళడానికి రెండుదోవలు వున్నవి. ఒక దారి పెద్ద మను ష్యులకని, రెండవ దారి స్త్రీలకు అనీ వ్రాసిపెట్టినారట. శాస్త్రి ఇలాగ అన్నాడు. "ఏమయ్యా ఈ సినిమా యజమాని మానవ జాతిని రెండు విధాలుగా మాత్రమే చేసినాడు పెద్దమనుష్యులు— స్త్రీలు అని!. మనము పెద్ద మనుష్యులము కాదని అందరికీ తెలుసు. మనలను పెద్దమనుష్యులనుగా ఎవ్వరూ చూడడము లేదు. మనం పెద్ద మనుష్యులం కాదు కాబట్టి తర్కరీత్యా స్త్రీలమే అయినాము. మనం వెళ్ళవలసింది ఈమార్గమేనయ్యా" అన్నాడు. ఈ వాదము ఉపచార ఛలము ఎందుకు అయినదో చెపుతాను. ఒక మాట యొక్క లక్ష్యార్థాన్ని తీసికొన ముఖ్యార్థాన్ని గ్రహిం చడము ఎల్లాగ ఉపచార ఛలము అయిందో అట్లాగే ఇక్కడ కూడా వాచ్యార్థాన్ని గ్రహించక తర్కరీత్యా సిద్ధించిన మరొక అర్థాన్ని గ్రహించడము ఉపచార ఛలము అయినది అని నేను సిద్ధాంతం చేస్తున్నాను.

మనుష్యుడు అని ఎవరిని అనాలె అనే ప్రశ్న వేసుకొందాము. మనుష్యుడు అనే మాట "మన్" అను ధాతువునకు సంబంధించి

నది. మన్ అనగా ఆలోచించుట. కాబట్టి మనుష్యుడు అంటే ఆలోచన చేసే శక్తి గలవాడు. అని అర్థము వచ్చింది. కాబట్టి ఆలోచన చేయలేని పిచ్చివాళ్ళను, పసివాళ్ళనుకూడా మనము మనుష్యులక్రింద లెక్కవేయకూడదు. వాళ్లు మనుష్యులు కారు. ఇది విపరీతమైన వాదన. ఇందులో మనము ఒక్క విషయము ఆలోచించవలె. పిల్లలకూ, పిచ్చివాళ్ళకూ ఏదో ఆలోచనలు వుంటవికదా. వాళ్ళను ఆలోచించలేనివాళ్ళ క్రింద ఎందుకు లెక్క వేయవలెను అనే విచికిత్స వస్తుంది. ఆలోచించడము అంటే, కొంచెం ఎక్కువైన అర్థంలో తీసుకొందాము. పిచ్చివాళ్ళకూ, పిల్లలకూ శక్తి తక్కువ. ధారణ శక్తి తక్కువ. మనస్కారము........(స్టెబిలిటీ ఆఫ్ మైండ్) తక్కువ. ఈ కారణాలచేత వాళ్ళకు ఆలోచించే శక్తిలేదనీ అంగీకరిద్దాము. అయినా ఆవాదన ఉపచార ఫలము ఎట్లా అయినది? ఈ ప్రశ్నకు సమాధానం చెపుతాను, వాళ్ళను మనుష్యులుకాదని ఎందుకు అంటున్నాము అంటే వాళ్ళకు ఆలోచించే శక్తిలేదనీ అంటే ఏశక్తి విస్తారము కలవాళ్ళనే మనుష్యులని అంగీకరించి అట్టి శక్తి వీళ్ళకు లేదు కాబట్టి వీళ్ళను మనుష్యులు కాదంటున్నాము. అంటే మనుష్యశబ్దము యొక్క వ్యుత్పత్త్యర్థానికే ప్రాధాన్యమిచ్చి రూఢార్థాన్ని గుర్తించడము లేదన్నమాట! లక్ష్యార్థాన్ని గుర్తించక వాచ్యార్థాన్ని మాత్రమే గుర్తించడము ఏల్లాంటిదో రూఢార్థాన్ని గుర్తించక వ్యుత్పత్త్యర్థాన్ని మాత్రమే గుర్తించడము అల్లాంటిదే. ఈ విధంగా ఇది ఉపచార ఫలమూ అంటాను.

పై వాదము ఉపచారఫలము క్రిందనే వస్తుంది. దానికి సరియైన కారణము చూపించినాను కూడా. అయినా ఈ విషయము

తర్క శాస్త్రజ్ఞులు ఒప్పుకోరు. మనుష్యుడు అనే శబ్దానికి సంబంధించిన వ్యుత్పత్త్యర్థానికే ప్రాధాన్యము ఇచ్చి బుద్ధిమంతుడు కానివాడు మనుష్యుడు కాదు అని వాదించడము సమభిరూఢాభాసము అనే దోష యుక్తమైన కుతర్క విశేషము అని తర్క శాస్త్రంలో న్యాయాభాసాల క్రింద పేర్కొనబడినది అంటారు. పైన చెప్పిన కారణాలవల్ల నేను దీనిని ఉపచారఛలము క్రిందనే చేరుస్తున్నాము.

ఒక వూళ్ళో ఒక చెరువు ఉన్నది. "ఇందులో ఎవరూ స్నానం చేయకూడదు" అని ఒక బల్లపైన వ్రాసి, ఆ బల్లను ఆ చెరువుగట్టున ఒక స్తంభానికి తగిలించినారు. అక్కడ కాపలాకు ఒక మనిషినికూడా వుంచినారు. ఇద్దరు మనుష్యులు వచ్చి బట్టలు విడిచి చెరువులోకి దిగబోతూవుంటే కాపలావాడు వచ్చి వాళ్ళకు ఆ బోర్డును చూపి "స్నానం చేయడానికి వీలులేదు" అన్నాడు. ఆ సంగతి బట్టలు విడువకపూర్వము చెప్పలేకపోయినావా ? అన్నారు వాళ్ళు. కాపలావాడు "అయ్యా బట్టలు విడువకూడదని లేదు. అందుకని వూరుకొన్నాను. బట్టలు విడిస్తే నా అభ్యంతరం లేదు. స్నానం చేస్తేనే నేను అభ్యంతరంపెడతానుఅన్నాడు. ఈకథలో కాపలావాడుస్నానం చేయకూడదనే మాటకు ముక్కకు ముక్కకు అర్థంతీసి, మొత్తంమీద వచ్చేఅర్థాన్ని వదిలివేసినాడు. ఇదికూడా ఉపచార ఛలమే! ఈ వాదములో కథకుడు లెటర్ ఆఫ్ ది లాకు ప్రాధాన్యం ఇచ్చి స్పిరిట్ ఆఫ్ ది లాను గుర్తించలేదు. అట్లుఅర్థాంతరము కల్పన చేయబడింది.

అతని పేరు దయానిధి. కాబట్టి అతడు చాలా దయగలవాడనీ, అతడు బ్రాహ్మణుడు కాబట్టి బ్రహ్మజ్ఞానము కలవాడనీ,

అతని పేరు వాచస్పతి కాబట్టి అతడు మహా మేధావీ, ప్రతిభా వంతుడూ అనీ వాదించడమూ ఒక చమత్కారమైన దబాయింపు. ఈ రకమైన దబాయింపును మనవాళ్ళు ఏవంభూతాభాసము అన్నారు. ఇది కూడా న్యాయాభాసాలలో ఒకటి. కాని నేను దీనిని ఉపచారఫలము క్రిందనే చేరుస్తున్నాను. ఈ కథలో వ్యుత్పత్త్యర్థానికే ప్రాధాన్యము ఇయ్యబడినది. అది ఒక పేరు మాత్రమే అన్న విషయము గుర్తింప బడలేదు. దీనిని ఉపచార ఫలముగా గ్రహించడము సమంజసమని తోచినది.

కుశలుడు అనే శబ్దానికి దర్భలు కోయువాడు అనియే అర్థము అని దబాయించేవాడు కూడా ఈ ఉపచార ఫలమునే ప్రయోగిస్తున్నాడు. పైన చెప్పిన ఉదాహరణలలో వలెనే ఇక్కడ కూడా కుశల శబ్దానికి దర్భలు కోయువాడు అనే వ్యుత్పత్త్యర్థానికి ప్రాధాన్య మిచ్చి నిపుణుడు అనే రూఢమైన అర్థాన్ని వదిలి వేస్తున్నాడు కథకుడు.

ఇల్లాగే గంగాయాం ఘోషః అన్నప్పుడు గంగలో పల్లె ఎల్లాగ వుందయ్యా అనడమూ, నత్తగుల్లను చూపి పంకజము అని చెప్పడమూ, పోలీసువాడిని చూపి ఇతడు రాత్రించరుడు అని అనడమూ ఈ రకం ఫలములే అని మనము గ్రహించవలసి వున్నది.

వాక్ఛలమూ ఉపచారఫలము ఒకేమోస్తరు కనిపిస్తవి. కాని వాటి రెండింటికి భేదమున్నది. అది ఏమిటీ అంటే—వాక్ఛలములో శక్తి వృత్తిచే బోధింపబడిన అర్థము. శక్తి వృత్తిచే బోధింపబడిన అర్థాంతరముచేత ఖండింపబడును. ఉపచారఛల

ములో లక్షణావృత్తిచే బోధింప నెంచిన అర్థమును శక్తివృత్తి కల్పితార్థము ద్వారా ఖండిస్తున్నాము. ఈ రెండును భిన్నములు.

మాటలయొక్క వివిధ అర్థాలను ఆశ్రయించుకొని ఏర్పడిన ఈ రకము ఛలాన్ని ఇంగ్లీషులో ది ఫాలసీ ఆఫ్ ఫిగర్ ఆఫ్ స్పీచ్ అంటారు. దీనినే లాటిలో ఫిగురా డిక్షనిస్ అని అంటారు. దీనికి సాఫిజమ్ అని ఇంకో పేరుకూడా వున్నది.

యాంఫిబొలీ అనబడు మరొక రకము ఛలమును మన తార్కికులు గుర్తించినట్లు లేదు. ఇది పాశ్చాత్య తర్కంలో వున్నది. వాక్య రచనలో వుండే తమాషా వలన ఈ ఛలము వుత్పన్నము అవుతున్నది.

ఒక రాజు పొరుగు రాజ్యంపై దండెత్తడానికి సంసిద్ధుడై తనకు జయము లభిస్తుందా లేదా అన్న సందేహమును పొందినవాడై జ్యోతిష్కుని అడిగినాడు. జ్యోతిష్కుడు "నదిని దాటితే ఒక రాజ్యము జయింప బడును" అని జ్యోతిషము చెప్పినాడు. నదిని దాటితే తనకే జయము లభిస్తుం దనీ, శత్రురాజ్యమే జయింప బడుననీ. ఈ రాజు అనుకొని దండయాత్ర సాగించినాడు. అయితే నదిని దాటిన తరువాత తన రాజ్యమే శత్రువులచే జయింపబడినది. జ్యోతిష్కుడు తాను సరియైన జ్యోతిషమే చెప్పినానని వాదించినాడు.

రెండు అర్థాలు తీయడానికి అనుకూలమైన పద్ధతిలో వున్నది ఆ వాక్య నిర్మాణం. ఆ వాక్యాన్ని ఆధారం చేసుకొని చేయ బడిన యాంఫిబొలీ అనే రకం ఛలవాదానికి చెందుతుంది. ఈ క్రింది వాక్యమూ అల్లాంటిదే "ఐ హోప్ యు దట్ యు ది

ఎనిమీ విల్ స్లే" అని వాక్యంకూడా రెండు అర్థాలు ఇస్తుంది. నీవే విరోధిని చంపుతావు అనీ, విరోధి నిన్ను చంపుతాడు అని. రెండు అర్థాలు చెప్పవచ్చు ఆ వాక్యానికి. ఇది యాంఫిబొలి అనబడు ఫలము.

రెండు పదార్థములు కలిసి వున్నపుడు అన్వయింప తగిన సత్యమును అవి విడి విడిగా వున్నపుడుకూడా అన్వయింప చేయడము ఒక దోషము. అంటే సాముదాయార్థమును చెప్పవలసినచోట్ల అవయవార్థము చెప్పడము అనే దోషాన్నే ఫాలసీ ఆఫ్ డివిజన్ అంటారు.

బిచ్చగాండ్ల విషయము తీసికొందాము. సాముదాయకంగా చూస్తే వాళ్ళకు మనము సాహాయ్యము చేయలేము అన్నమాట సత్యమే! ఒకళ్ళా ఇద్దరా? ఆ పెద్ద సముదాయానికి మనమేమి సాయం చేయగలము! కాని వైయుక్తికంగా ఈ సత్యము అన్వయించదు. ఒకరికో ఇద్దరికో సాయము చేయలేకపోము. ఒకడు వుంటాడు, అతడు ఎవ్వరికీ ముష్టి వేయడు. ఏమండీ అంటే ఎంతమందికని వేయగలమండీ అంటాడు. చూచేవాడికి ఇది నిజమే అనిపిస్తుంది. ఆయన న్యాయమే మాట్లాడుతున్నట్లు తోస్తుంది. సూక్ష్మంగా చూస్తేగాని అది తర్కహితము గాని వాదన అనీ డబాయింపు అని తెలియదు. సముదాయానికి అన్వయిస్తే ఏది సత్యమో దానిని సముదాయము యొక్క అవయవాలకు అన్వయింపచేస్తున్నాడు. ఈ కథకుడు. అందరికీ ముష్టి వేయలేనిమాట నిజమే. కాని కొందరికి వేయగలము కదా! అందరిని కలిపి చూస్తే ఏది సత్యము అయినదో అది

వైపా_క్తింగా చూస్తే నిజము కాదు. ఈ విషయము గుర్తించక ఎంత మందికని ముష్టి వేయగలము అని దబాయించడములో ఫాలసీ ఆఫ్ డివిషన్ అనే దోషము వున్నది.

బల్లమీది పుస్తకాలు మఱుగు బరువు అంటే ఒక పుస్తకము తీసి. "ఇది మఱుగు బరువు అన్నమాట" అన్నాడు. ఒక ఫలవాది. బల్లమీది పుస్తకాలు మఱుగు బరువు అన్నపుడు పుస్తకాలన్నీ కలిపి అని అర్థము!

ఆంధ్రదేశంలో రెండు కోట్ల జనం గ్రామవాసులు అంటే, "అయ్యో బాబో! ఒదేం గ్రామము రెండు కోట్ల జనం వుంటే!" అన్నపుడు అది ఈ రకమునకు చెందిన ఫలోక్తే!

కలిసివుంటే మంచిది అనే నీతిని బోధించడానికి, తండ్రి కుమారులకు ఒక పూచికపుల్లల కట్టను ఇచ్చి దానిని నడిమికి విరువమనడమూ, ఒక్కడూ విరవలేక పోవడమూ మనకు తెలిసిన కథే. ఎవ్వరు ఆకట్టనువిరువలేకపోయినారు, అప్పుడుతండ్రిఆకట్టలో వుండే పుల్లలను విడిగా తీసి ఒక్కొక్క దానినే తుంచి వేయమన్నాడు. అప్పుడు కుర్రవాళ్ళలో ఒకడు "మా శక్తికి మించిన బలముగల పుల్లలేగదా అవి! మేము ఇప్పుడు మాత్రము ఎట్లా విరుస్తాము?" అని వాదించినాడు. అతని వాదన ఆపయవార్థ ఛలము అనబడే దబాయింపు లేక అవహేళన అవుతున్నది. ఆ పుల్లలన్నీ కలిసి వున్నపుడు చెప్పవలసిన ధర్మము విడిగా వున్నపుడు ఆరోపితము కాదు.

రెండు పదార్థాలు విడిగావుంటే ఉపాత్తము అయ్యే ధర్మము కలిసి వున్నపుడు తిరోధానము కావచ్చు. అయినా కూడా అనే

ధర్మము వున్నదని ఉద్ఘాటించడము సముదాయఫలము అయింది. వేరు వేరు కాపురాలు పెట్టుకొని అన్నదమ్ములు జీవిస్తూ ఒకరి కొకరు సాహాయ్యం చేసుకొంటూ పోరు పొరపూ లేకుండా వున్నారు. విడిగావుంటే వారి మధ్య ప్రవర్తిల్లే ధర్మము లేపు వారు కలిసివుంటే వుండదు. ఉంటుందని వాదించడము సముదాయార్థఫలము.

పన్నెండూ, ఇరవైమూడూ అనే సంఖ్యలను తీసుకొందాము. ఈ రెండిటిలో ఏదిగాని ఏడు అనే సంఖ్యచేత భాగింపబడదు. కాబట్టి ఈ అంకెలు ఏడుచేత భాగింపబడకపోవడము వాటి ధర్మము. అయితే అవి కలుపగా వచ్చిన 35 అనే అంకెకు ఆ ధర్మము చెల్లదు. పన్నెండులోగాని, ఇరవైమూడులోగాని ఏడు పోదు కాబట్టి అవి కలుపగా వచ్చిన మొత్తములో మటుకు ఎల్లా పోతుంది? అని ఎవరైనా దబాయించి నప్పుడు ఇది "సముదాయార్థఫలము ఇందులో ఆక్షిప్తమైయున్న దోషము ఇది" అని చెప్పవలసి వుంటుంది. ఈ రకము ఫలమును మన ప్రాచీన తార్కికులు గుర్తించినట్లు లేదు.

మనుష్యుడైనవాడు పొరపాట్లు చేస్తూ వుంటాడు. కాగా మనుష్యులతో కూడిన శాసనసభ చేసే తీర్మానాలన్నీ పొరపాట్లే అవుతవి అని అనడము ఈ రకము ఫలము. వైయక్తికంగా సత్యమైన విషయము సాముదాయకంగా సత్యము కాదు.

ఛలములన్నీ శబ్ద వ్యాపారాలను ఆశ్రయించుకొని ఏర్పడి నవే. కాకువు అనేది శబ్ద ధర్మము. కాబట్టి కాకువుచే అర్థాంతర కల్పన సాధ్యము అయినట్లు అయితే అది కూడా ఛల విశేషంగా పేర్కొనడము ఉచితమేగదా?

కాకువుచే క్రొత్త అర్థమును సిద్ధింపజేయడమునే అలంకార శాస్త్రంలో ధ్వని అంటారు. అదే వ్యాపారాన్ని తర్కంలో కాక్వాక్షిప్తఫలము అనవచ్చు.

అర్థాంతర కల్పనతో ఫలము సాధించడానికి రెండుమార్గాలు వున్నవి. పలుకుతూ పలుకుతూవున్న వాక్యమును మధ్యలో ఆపి, విపరీతమైన అర్థము స్ఫురించే లాగున చేయడము ఒక పద్ధతి. దీనికి ఒక ఉదాహరణను ఇస్తాను.

ఒక వక్త ఒక కళాశాలకు వచ్చి "బుద్ధి హీనుడు" అను విషయమును గురించి మాట్లాడుతా నన్నాడు. సరేనని, ఆ కాలేజి ప్రిన్సిపాల్ ఆయనను విద్యార్థులకు పరిచయంచేస్తూ ఇల్లా అన్నాడు. ఈరోజున మీరు బుద్ధిహీనులనుగురించి తెలుసుకొంటారు. ఈ ఉపన్యాసం ఇచ్చే పెద్దమనిషికూడా బుద్ధిహీనులను గురించి వారి మానసిక ప్రవృత్తులను గురించి బాగా చదివినవాడు.

సాభిప్రాయంగా పై వాక్యంలో ఏర్పరచబడిన విశ్రాంతి వలన ఏ అర్థాంతరము స్ఫురిస్తున్నదో తెలుస్తూనే వున్నది ఇదే వాక్యాక్షిప్త ఫలము.

ఈ ఫలోక్తిని విని విద్యార్థులంతా వక్తను చూచి నవ్వినారు. ఆ వక్తకూడా వారితోపాటు నవ్వుకొన్నాడు. ఆ తరువాత ఆయన లేచి ప్రారంభింపబోతూ ప్రిన్సిపాల్ అన్న వాక్యాలకు జవాబుగా ఇల్లాగ అన్నాడు. "ప్రిన్సిపాల్‌గారు నిజమే చెప్పినారు. నేను ఈ రోజున బుద్ధిహీనులను గురించే చెప్పదల్చుకొన్నాను." ఈమాట నొక్కి అనడములో ఏదో విపరీతమైన అర్థము స్ఫురించి అంతా ప్రిన్సిపాల్‌ను చూచి నవ్వినారు. ఆయన మళ్ళీ ఇల్లాగ అన్నాడు. "అయితే బుద్ధిహీనత విషయంలో నేను శ్రీ

ప్రిన్సిపాల్........అనుకొన్నంత ఎక్కువగా చదువలేదు. ఈ వాక్యంలో విశ్రాంతికూడా విమాత్నార్థస్ఫోరకంగానే వున్నది. మళ్ళీ అంతా నవ్వినారు. ఎక్కడ ఆపితే తమాషా అయిన వేరు అర్థము వస్తుందో అక్కడ ఆపడమువలన ఛలోక్తి పుట్టినట్టు అయినది. కాక్వాక్షిప్త ఛలము అంటే ఇదీ అని నా అభిప్రాయం.

వాక్యముయొక్క మధ్యలో ఆ పదముకాక, వాది అన్న వాక్యాన్నే ప్రతిపక్షికికూడా ధ్వనిసముత్పన్న సమర్థమైన కాకువుతో అని ఛలమును సాధించ వచ్చును. ఇద్దరు బీద గృహస్థులు ఒక హోటలులో బసచేసినారు. అక్కడ సోఫాలు, పంకాలు, బల్లలు, తివాసీలు, కుర్చీలు, పరుపులు అన్నీ దర్జాగా వున్నవి. ఇద్దరు ప్రక్కలపైన పడుకొన్నారు. ఎన్నివున్నా ఇంటిదగ్గిర వున్నప్పుడు కలిగే తృప్తిని ఈ తివాసీలూ, కుర్చీలూ పరుపులో ఇయ్యలేవన్న వుద్దేశంతో ఆ ఇద్దరిలో ఒకాయన అన్నాడూ, "ఎట్లాగైనా ఇల్లులాగ ఎల్లా వుంటుందీ?" అని; రెండో ఆయన ఫక్కుననవ్వి, అవును. ఇల్లులాగఎల్లావుంటుంది. ఇల్లులాగ ఎప్పటికీ వుండదు? అన్నాడు. అంటే మన ఇళ్ళలో వుండేవి కుక్కిమంచాలు. వాసన గదులేకదా అని ఎత్తిపొడుపు. ఈ ఎత్తిపొడుపు ఆ మాటలు అన్న కాకువులో అధిక్షిప్తమయి వున్నది. ఇద్దరూ నవ్వుకొన్నారు. కాక్వాక్షిప్తఛలము ఈ విధంగా జనిస్తుంది.

విజయనగర మహారాజులంగారు నడిమింటి మంగళేశ్వర శాస్త్రిగారితో మాట్లాడుతూ అదేమిటంచి, మీ ఇంటిపేరు నడిమింటివారు అనడం చాలా విచిత్రంగా వున్నది. ముందు ఇల్లు కాకపోయె వెనక ఇల్లు కాకపోయె; సరిగా నడిమిల్లు ఏమిటండీ

అని పోకసగా అని నవ్వినారట. నడిమింటి మంగళేశ్వర శాస్త్రి గారు మందహాసం చేసి "ఏదో లెండి, నడిమిల్లు అంత విలువ అయినది కాదనుకోండి. అయినా పూసపాటి చెయ్యదా మహా రాజా!" అన్నారట. (మహారాజావారి ఇంటిపేరు పూసపాటి వారు) పూసపాటి అనే మాట శ్లిష్టమైనది. రాజావారు కూడా ఈ చమత్కారానికి సంతోషించినారట!

కొత్త సత్యనారాయణ చౌదరిగారు పై ఛలోక్తిని గురించి చెప్పినారు.

ఒక శబ్దానికి రెండు అర్థాలు వున్నప్పుడే ఈ వాక్ఛలం సాధ్యం అవుతుంది. ఈ రకం ఛలం శబ్ద వ్యాపారాన్ని ఆశ్రయించుకొని వుంటుంది.

ఛలవాదములను గురించి సమగ్రంగా వ్రాసినానని తృప్తిని పొందుతున్నాను. మన ప్రాచీన గ్రంథాలలో ఇంత సమగ్రమైన పరామర్శ, ఈ విషయాన్ని గురించి లేదేమో అని నేను అభిప్రాయపడుతున్నాను. ఈ ఒక్క ఛలమును గురించి పాశ్చాత్యుల లాజిక్‌లోని విషయాలకు ప్రతీచి. తర్కశాస్త్రంలోని విషయాలకు సమన్వయపరిచినాననికూడా సంతోషిస్తున్నాను. ఈ మాత్రం తృప్తిలేకపోతే ఈ పని నేను చేయలేను. పండితుల ఈ వ్యాసం చదివితే ఏమి అభిప్రాయం కలుగుతుందో తెలుసుకోవలెనని వున్నది. వారి ఆమోదం ఆదరణ, ఆశీస్సులు నాకు లభిస్తే, నేను ఇంకా ఈ కృషిని సాగించవలెనని. అన్ని రకముల (ఫాలసీస్) దోషయుక్తమైన వాదములనుగురించి వ్రాయవలయునని ఉన్నది.

